గ్రంధకర్త యితర రచనలు

ఇండియాలో విప్లవం
ఇండియా భవిష్యత్తు
యం. యన్. రాయ్ జీవితం
జవహర్‌లాల్ నెహ్రూ
ప్రపంచ కథలు
ప్రపంచ నాటికలు
మల్లెపూలు (కథలు)
యం. యన్. రాయ్ వ్యాసాలు 1వ భాగం



వెల రూపాయి

# విషయసూచిక







# తాత్త్విక విప్లవం

"తూర్పు తూర్పే, పాశ్చాత్యసంపర్కం పనికిరాదు." యీ వాదన మనదేశంలో ప్రచారం అయినంతగా మరేదేశంలోనూ లేదు. అజ్ఞానంలోవున్న సామాన్య ప్రజానీకానికి ఇలాంటి సమస్యలు చాలాదూరం. వారి వూహాశక్తికివి అతీతాలు. కాని బాగా చదువుకొని మంచి, చెడ్డలను వివేచనాశక్తితో విమర్శించ గల బుద్ధిశాలురే యీ ప్రచారాన్ని సాగిస్తున్నప్పుడు దీనిలోతు, పాతులను గూర్చి హేతువాదంతో ఆలోచించటం అవసరం. కేవలం మంచి, చెడ్డలను యిద మిత్థమని బుద్ధి నుపయోగించి తెల్సుకోగల తెలివి తేటలు, జ్ఞానం వున్నంత మాత్రంచేత ప్రయోజనం వుండదు. తెల్సుకొనిన ఫలితాలను ఆచరణలో పెట్టగల సామర్థ్యం, ధైర్యసాహసాలు, కార్యదీక్షకూడ వున్నప్పుడే మానవునిలో వున్న జ్ఞానం సమాజానికి వుపకరిస్తుంది.

ప్రతిదేశంలోనూ, మానవసంఘంలో యెప్పుడో వొకప్పుడు వెనుకటి భావాలను, ఆచార, వ్యవహారాలను, సాంఘిక పరిస్థితులను గూర్చి, వాటిబాగోగులు లోతుకి దిగి ఆలోచించవలసిన అవసరం యేర్పడుతుంది. ఆ భావాలు, ఆ సాంఘిక పరిస్థితులు సమాజాన్నిక ముందుకు తీసుకొనిపోజాలనప్పుడే సంఘం యిలాంటి విమర్శకు గురి అవుతుంది. కాని మొదట్లో యీ అవసరాన్ని గుర్తించినవారు, సాంఘిక

పరిస్థితులను కూలంకషంగా అర్థం చేసుకోగలిగినవారు ఏకొద్ది మందో వుంటారు. వారి ప్రచారం ఫలితంగానేమి, సమాజంలో వున్న ఆవశ్యకతను బట్టియేమి, సంఘంలో దాస్యానికి గురి అయ్యే హెచ్చుమంది దీనికి సుముఖంగా వున్నప్పుడు సంఘంలో నూతన పరిస్థితులేర్పడి నూతనసంఘం యేర్పడుతుంది.

ప్రజల్లో ఒక్కొక్క దశలో వచ్చేమార్పులు, సంస్కృతి అభివృద్ధి ఆ యా సాంఘిక పరిస్థితులమీద ఆధారపడివుంటవి. వీటికి వెనుకటి దశలో జరిగిన మార్పులు పునాది రాయి. యీ విధంగా మానవసంఘం ఒకదానితో నొకటి ఆధారం చేసుకొని అభివృద్ధిచెందుతూ వచ్చింది.

భారతదేశ చరిత్ర యిప్పటిది కాదు. అతిపురాతన మైన మానవసమాజంలో మనసంఘం కూడావుంది. కాని చాలావరకు మనవెనకటి చరిత్ర, చరిత్రగా లేదు. కేవలం పుక్కిటి పురాణంగా నిలిచిపోయింది అయినా చాలా జాగ్రత్తగా పరిశీలిస్తే మనసంఘంలోనూడ లోగడ ఒక్కొక్క దశలో ఒక్కొక్క భావం ప్రచారంలోవుందని తేలుతుంది. వేలసంవత్సరాలక్రితం, పాశ్చాత్య దేశాల్లోని మానవులు, మానవులుగా పరిగణింప బడని సమయంలో యిక్కడ మానవసంఘం చాలావున్నత దశలోవుండి యితర దేశాలకు మార్గదర్శిగా వుంది.

దీన్ని యెవరూ కాదనజాలరు. కాదనరు. కాని యీ భావనమనలో ఒకవిధమైన మాంద్యాన్ని సృష్టించింది. కేవలం గతించినదాన్ని వేదాల్లో పురాణాల్లో చదువుకుంటూ, దానితో తృప్తిపడి అసలు మన బాధ్యతనే మరచిపోతున్నాం. వెను

కటిదాన్ని అంటే పూర్వకాలంలో తత్వవేత్తలు, శాస్త్రజ్ఞులు చూపించినదాన్ని సుఖవంతమైన, అభివృద్ధికరమైన సమాజాన్ని మనం నిర్మించుకోవలసి వుంది.

గత పాతికసంవత్సరాలనుంచి మనదేశంలో ముఖ్యంగా రాజకీయసమస్యలు, జాతీయస్వాతంత్ర్యం ప్రధానపాత్రవహించినై. యీ వుద్యమం మొట్టమొదట విద్యార్థికుల్లో వ్యాప్తి చెంది రాను రాను ప్రజానీకంలో కూడా ప్రాకింది. ఈ వుద్యమం కేవలం నిర్హేతుకంగాకాని లేక పరిపాలనలో కొన్ని మార్పులకోసం కాని బయలుదేరలేదు. బ్రతుకు తెరువుకి సుఖంగా జీవించటానికి ప్రజానీకంలో రేకెత్తినకాంక్ష యీ వుద్యమ రూపంలో బయల్పడింది. కాని యీ వుద్యమం, ప్రజల్లో రేకెత్తిన కాంక్షకు సక్రమమైన స్వరూపాన్ని యివ్వలేక పోయింది. అజ్ఞానంలో వున్న ప్రజానీకం కేవలం అసంతృప్తితో వుద్రేకాన్ని చెంది అప్పుడప్పుడు తిరుగుబాటు చేస్తూ వుండవచ్చు. కాని దీనికి సక్రమమైన పంథా చూపవలసిన బాధ్యత విజ్ఞానవంతులమీాద వుంది. కాని విజ్ఞానవంతులు కూడ ఈ వుద్యమ ఆవశ్యకతను గుర్తించ నంతకాలం సరియైన మార్గాన్ని చూపలేరు.

కాగా మనరాజకీయాల్లో వుద్రేకం, ఆవేశం ప్రధాన పాత్ర వహించి అసలు రాజకీయాలనే తికమకలు చేస్తున్నవి. వుద్రేకాన్ని పూర్తిగా త్యజించటం మానవునికి చేతకాని పని. కాని కొన్ని ముఖ్యసమస్యలను గూర్చి మనం ఆలోచించేటప్పుడు ముందు మనం వుద్రేకంకంటె హేతువాదానికి, విజ్ఞానానికి ప్రాముఖ్యం యివ్వవలసి వుంటుంది. సమస్యాపరిష్కా-

రానికి తగిన కారణాలు గ్రహించిన తరువాత, ఫలితాలు పొందటానికి ప్రజానీకాన్ని సమీకరించి వుద్రేకపరచటంలో అర్థం వుంది. అలా కాకుండా కేవలం దారీ—తెన్నూ లేకుండా ప్రజల్ని ఆవేశపూరితులు చేసినందువల్ల ప్రయోజనం వుండదు.

మనకు రాజకీయ స్వాతంత్ర్యం కావాలి. కాని యిదే మన పరమ లక్ష్యం కాదు. మన గమ్యస్థానానికి ఇది రహదారి. భారతదేశ ప్రజలు అభివృద్ధి చెందాలంటే ముందు వారు రాజకీయంగా స్వాతంత్ర్యం సంపాదించాలి. విదేశప్రభుత్వం మన ఈ అభివృద్ధిని అరికట్టింది. కాబట్టి మనం దాన్ని తొలగించాలి. కాని ఇంతపెద్ద దేశాన్ని కేవలం కొద్దిమంది తెల్లవారు యేవిధంగా జయించగల్గారో, దీనికి కారణాలేంటో మనం ఆలోచించటంలేదు. సాంఘికంగా, నైతికంగా మన సంఘం హీనస్థితికి రావటం చేతనే కొన్ని కోట్లమంది భారతీయులను ఏకొద్దిమంది తెల్లవారో వశం చేసుకోగలిగారు. అనేక కారణాలవల్ల, అనేక వందల సంవత్సరాలనుంచి భారతదేశం అన్నివిధాల అజ్ఞానదశలోపడి క్రుంగి కుమిలి పోతూవుంది. మనం యీ సత్యాన్ని మరచిపోయి బ్రిటిషువారు వెళ్ళిపోతేసరి తిరిగి యథాప్రకారంగా మనం అభివృద్ధి చెందుతామనే దృష్టిలోవున్నాం. పుండు పుట్టగానే ఈగలు ముసరక తప్పవు. ఈగలను పారద్రోలితే పుండు మానుతుందనుకోటం పొరపాటు. శరీరం బాగుపడటానికి ఈగలు ముసరకుండా వుంటానికి కారణమైన పుండు మాన్పటం మన కర్తవ్యం. అదే విధంగా మనం అభివృద్ధి చెందాలంటే అభివృద్ధిని అరికట్టిన పరాయి ప్రభుత్వం, దానితోపాటు తక్కిన కారణాలన్నింటిని

తొలగించటం అవసరం. ఇందుకు మనం మన చరిత్ర గమనాన్ని పరిశీలించ వలసి వుంటుంది.

రెండువందల సంవత్సరాలనుంచి మనదేశం బ్రిటిషు పరిపాలనలో వుంది. కాని అంతకు ముందుకూడా మనజాతి స్వతంత్రజాతిగా లేదు. పదమూడవ శతాబ్దంలోనే భారతదేశం రాజకీయ స్వాతంత్ర్యాన్ని కోల్పోయింది. అప్పుడుకూడా చాలా కొద్దిమంది విదేశస్థులే భారతదేశాన్ని ఆక్రమించుకో గలిగారు. యింత జనాభా గలిగిన పెద్దదేశం విదేశస్థులను యెందుకు అడ్డలేక పోయింది? అక్కడక్కడ కొంతమంది రాజులు విదేశస్థులను యెదుర్కొనటానికి ప్రయత్నాలు జరిగినై. కాని సామాన్య ప్రజానీకంలో యీ అవరోధన శక్తి నశించినది. వారు పూర్తిగా తాటస్థ్యం వహించారు. కాగా విదేశస్థులు భారతదేశాన్ని స్వదేశస్థుల సహాయంతో జయించ గలిగారు. అంటే యే కొద్దిమంది దేశద్రోహుల సహాయంతోనో, లేక కొంతమందికి ఆశలు కల్పించో విదేశస్థులు మనదేశాన్ని ఆక్రమించు కోలేదు. వెనుక మహమ్మదీయులు, తరువాత బ్రిటిషువారు మనదేశంమీద దండయాత్ర జరిపినప్పుడు యిక్కడవున్న సాధారణ జనంలో పరిపాలనకు పనికివచ్చే హెచ్చుమంది సహాయం వారికి లభించినది. పైనవున్న కొంతమంది రాజులువారిని ఎక్కడక్కడ యెదుర్కొంటూ వుంటే క్రింద నిరుద్యోగంతో, దారిద్ర్యంతో బాధపడుతున్న సాధారణప్రజానీకం వారిపరిపాలనకు దోహదమిచ్చి, వారి రాజ్యాంగయంత్రానికి పునాదులు వేస్తారు. లేకపోతే పరాయిదేశస్థులు యెక్కడనుంచో, యేకొద్దిమందో

వచ్చి యింత పెద్దవిస్తీర్ణం, జనాభాగల దేశంలో అధికారం సుస్థిరం చేసుకోటం అసంభవం. గజనీనుంచి కాని, లేక పర్షియానుంచి కాని ముసల్మానులు యెంతమంది వచ్చారు? మొత్తం లెక్కవేస్తే అంతాకలిసి పది, పదిహేనువేలకంటె యెక్కువమంది వుండరు. యీ కొద్దిమంది విదేశస్థులు తమ శారీరక, బుద్ధిబలాల్ని వుపయోగించి మనదేశాన్ని ఆక్రమించుకో గలిగారని అంటే మనం కేవలం మనచరిత్రను, సాంఘిక పరిస్థితులను మరచిపోయి అన్నమాటలు కాక తప్పవు. మహమ్మదీయులు, ఫ్రెంచివారు, బ్రిటిషువారు మన దేశాన్ని యేకొద్దిభాగమో ఆక్రమించుకోగానే యిక్కడ మన దేశంలో, మన ప్రజలనుంచే వారికి రక్షణగా సైన్యాన్ని సృష్టించుకో గలిగారు. అంటే అప్పటి మనసాంఘిక పరిస్థితులకు విభిన్నమైన, తిరుగుబాటుచేసే ప్రజానీకం మనదేశంలో వుందని రుజువు అవుతుంది. యింకా విపులంగా చెప్పాలంటే మనసాంఘిక పరిస్థితులు బూజు పట్టిపోయినై. సంఘం ముందుకు వెళ్లాలంటే నూతనపరిస్థితులు సృష్టించుకోవాలి. లేకపోతే సంఘం అధఃపతనం చెందక తప్పదు.

సరిగ్గా నాలుగువందల సంవత్సరాలక్రితం ఐరోపా ఖండం యిదేస్థితిలోవుంది. కాని వారు యీపరిస్థితులను అధిగమించి నూతన సంఘాన్ని సృష్టించుకోగలిగారు. అందుకనే నేడు ఆధునిక విజ్ఞానంలో వారు ముందడుగు వేయగలిగారు. సంఘం నిర్జీవమైనప్పుడు నూతన పరిస్థితులు కల్పించి సంఘానికి పునర్జీవం పోయాలనే తత్వం—భావ విప్లవం—భారత దేశంలో శూన్యం కావటంచేతనే మనసంఘం ఇంత వెనుక

బడి వుండటానికి కారణం. వున్న సాంఘిక పరిస్థితుల అవసరం తీరిపోయి, వాటివల్ల లాభానికి బదులు నష్టం కలుగుతున్నప్పుడు వాటిని తొలగించి నూతన పరిస్థితులు కల్పించుకోవలసిన ఆవశ్యకత, ముందుచూపు, విప్లవభావాలు ప్రజాసామాన్యం ముందు పెట్టగలిగిన విజ్ఞానవంతులు, విప్లవ వాదులు మనదేశంలో లోపించబట్టే మనం నేడు ఇలాంటి దుర్గతిలో వుండవలసివచ్చింది. మనదేశ చరిత్రను మనం ఈ దృష్టితో గనక పరిశీలిస్తే రాజకీయంగా, ఆర్థికంగా స్వాతంత్ర్యం పొంది సంఘాన్ని పునర్నిర్మాణం చేసుకోటానికి ముందు మనకు గురుతరమైన బాధ్యత మరొకటివుంది. అదే తాత్త్విక విప్లవం— ప్రజానీకానికి పాత భావాలమీద, పిచ్చిన మ్మకాలమీద మోజుపోగొట్టి నూతన భావాలకు, నూతన పరిస్థితులకు త్రిప్పటం. దీన్ని నెరవేర్చవలసిన బాధ్యత నాయకులం, విజ్ఞానవంతులం అని చెప్పుకునేవారి మీదవుంది.

మానవుడు ప్రకృతితో సంబంధం పెట్టుకొని మానవుడుగా పరిగణింప బడుతున్నప్పటినుంచి మానసికంగా అతడు అభివృద్ధి చెందటానికి పోరాటం జరుగుతూనే వస్తుంది. పూర్వకాలంలో భారతదేశంలో, గ్రీక్ దేశంలో ఇలాంటి పోరాటం ఒకే సమయంలో జరిగింది. కాని అప్పుడు వారిలో కలిగిన భావవిప్లవం, సృష్టినిగూర్చి కలిగిన ఆలోచనాశక్తి కేవలం సిద్ధాంతరూపంలోనే ఆగిపోయినై. ప్రాచీన భారత తత్వశాస్త్రాల్ని పరిశీలిస్తే అందులో కేవలం హేతువాదం మీద నడచిన భౌతికవాదం గోచరిస్తుంది. ఉపనిషత్తులన్ని యిదేధోరణిలో నడచినై. షడ్దర్శనాల్లో కేవలం మతాన్ని

నాశనం చేయటానికే ప్రయత్నం జరిగినట్లు కనబడుతుంది.

యీ విధంగా ప్రాచీనకాలంలో ఐరోపాఖండం మానవ సమాజం, సమాజంగా పరిగణించ బడనప్పుడు భారతదేశం ఆధ్యాత్మికంగా బాగా ముందడుగు వేసింది. కాని పాశ్చాత్య దేశాలు ఆధునిక ప్రపంచంలో నూతన పరిస్థితులు సృష్టించు కొని సమాజాన్ని ముందుకు తీసుకొని వెళ్లుతున్నప్పుడు భారతదేశం ఆ వుద్యమంలో పాల్గొనలేకపోయింది. ఒకప్పుడు తక్కిన ప్రపంచానికి మార్గదర్శిగావున్న భారతదేశం నేడు అన్నిటికంటె, అన్ని పరిస్థితుల్లోకూడా వెనకబడి వుంది.

భారతదేశంలో సాంఘికపరిస్థితులు బూజుపట్టి సంఘం నిర్జీవమై హీనస్థితిలోపడ్డ కొన్నివందల సంవత్సరాలకు ఐరోపా ఖండంలో యీ తాత్విక విప్లవం బయలుదేరింది సంఘం పునఃసృష్టి చేయటానికి కావలసిన శక్తులు లోపించటచేత యిక్కడ అలాంటి వుద్యమం బయలుదేరటానికి వీల్లేక పోయింది. ఇతరదేశాల్లో ఆ వుద్యమం ఫలించి అక్కడి సమాజాలు ముందుకు వెళ్ళుతుంటే యిక్కడ మనం మూఢ ఆచార, వ్యవహారాల్లో తగుల్కొని వాటినుంచి విముక్తి చెందక తక్కిన ప్రపంచంలోని అనుభవాన్ని పొందలేక పోయ్యాము.

గత రెండువందల సంవత్సరాలనుంచి మనం బ్రిటిషు ప్రభుత్వం ద్వారా కొంతవరకు 'పాశ్చాత్య నాగరికత' తో సంబంధం కల్పించు కొన్నాము. కాని పాశ్చాత్య విజ్ఞానంతో అస్పృశ్యత అవలంబించి దాన్ని దగ్గరకు రానీయటం లేదు, మనం యింత అధోగతిలో వున్నామని పరాయి ప్రభుత్వాన్ని

దూషించినంత మాత్రం చేత ప్రయోజనం కల్గదు. సహజం గానే వారు మనలను పాశ్చాత్య విజ్ఞానాన్నుంచి, ఐరోపా ఖండంలో 18 వ శతాబ్దంలో వచ్చిన తాత్విక విప్లవంనుంచి దూరంగా వుంచటానికి ప్రయత్నిస్తారు. మనకూడా ఆ భావాలు యేర్పడితే మనంకూడా అదే విధంగా తిరుగు బాటుచేసి, వారిని తరిమివేసి నూతన సమాజాన్ని సృష్టించు కుంటామని వారికి భయం. ఇప్పటివరకూడా మనదేశం లోని విజ్ఞానవంతులు, విద్యాధికులు పాశ్చాత్య విజ్ఞానమంటే యేవో కొన్ని కొండగుర్తులు తప్ప, దానిద్వారా నేర్చుకో దగినవి — విప్లవభావాలు — నేర్చుకోటానికి కావలసిన కాంక్ష చూపటంలేదు. పాశ్చాత్య విజ్ఞానంతోనూ, ఆధునిక మానవ సమాజం పొందుతున్న అభివృద్ధితో సంబంధం లేకపోవుట చేతను, తరువాత పరాయి దేశస్థుల ఆక్రమణవల్లను, మనం నిస్సహాయస్థితిలోపడి ప్రాచీన భారతదేశ సంస్కృతినిచూచి తృప్తిచెందుతూ కాలంగడుపుతున్నాం. కాగా యీతత్వం ప్రబలి చివరకు ప్రాశ్చాత్య విజ్ఞానం మనకు పనికిరాదు. కేవలం మనదేశం వొకప్పుడు ఇంతకంటె వుచ్ఛస్థితిలోవుందని ఆధునిక విజ్ఞానాన్ని ద్వేషబుద్ధితో చూపటం అలవాటైపోయింది. ఇదే తత్వం నేడు భారతదేశనాయకుల్లో ప్రతిబింబిస్తుంది. వారు "మనది ప్రాచీనదేశం, గొప్పసంస్కృతి" అని తప్ప ఆధునిక కాలంలో తక్కిన ప్రపంచం యే విధంగా ముందుకు వెళ్ళు తుందో ప్రజానీకానికి చూపటంలేదు. దీనిఫలితంగానే మన రాజకీయ పోరాటంలో "భారతీయులు ఆధ్యాత్మికవాదులు

పాశ్చాత్యులు భౌతిక వాదులు" అనే తత్వం ప్రధానప్రాత వహిస్తుంది.

ప్రస్తుతానికి లోతుకి దిగి వీటి బాగోగులను విచారించటం నాఅభిమతంకాదు. కాని ఐరోపా ఖండంలో మాదిరిగా శాస్త్రీయదృక్పధాన్ని; విజ్ఞానాన్ని భారత దేశం అలవరచుకో పోవటం చేతనే మనసంఘం యింతవెనుకబడి వుందని, అక్కడి సంఘాలు ఆవిజ్ఞానం ద్వారా నేటి యీస్థితిలోకి రాగలిగినవనే యదార్థాన్ని వొప్పుకోక తప్పదు. బ్రిటిషువారు ఆవిజ్ఞాన బలంచేతనే మనమీద పెత్తనం చలాయించగల్గుతున్నారు. మనం యీ హీనసత్వం నుంచి విముక్తిచెంది,అభివృద్ధి చెందాలంటే మనంకూడా అట్టి విజ్ఞానాన్ని అలవరచుకోవాలి. దీనికి రెండే మార్గాలున్నవి—వొకటి— మనంకూడా ఐరోపా ఖండంలో జరిగినట్లుగాతాత్విక విప్లవాన్ని స్వానుభవంద్వారా స్వశక్తితో జరిపి సంఘాన్ని ముందుకు తీసుకొని వెళ్ళటం— రెండోది—వారి అనుభవాన్ని ఆధారంగా తీసుకొని సంఘాన్ని ముందుకునడపటం. మొదటిది సిద్ధాంతరీత్యా బాగా వున్నా ఆచరణలో ప్రస్తుతం కానిపని. మనచరిత్ర గమనం ఐరోపాఖండంలోమాదిరిగా నడిచినట్లైతే నేడు మన సంఘం మరోస్థితిలోవుండేది. సంఘంలో గట్టి అవరోధాలు యేర్పడటం చేతనే యిక్కడ తాత్వికవిప్లవం జరగటానికి వీల్లేక పోయింది. దీన్ని విపులంగా చర్చించాలంటే మన ప్రాచీన తత్వశాస్త్రాన్నిగురించి చాలా మాట్లాడవలసి వుంటుంది. కాబట్టి ప్రస్తుతానికి ఒకమాటచెప్పి ఆవిషయం ముగిస్తాను. బౌద్ధమతం సంఘంలో హేతువాదానికి కొంత దోహదం

ఇచ్చింది. కాని బౌద్ధమత పతనంతో పాటు హేతువాదం కూడా నశించి శాస్త్రీయ దృక్పథం, విజ్ఞానం అభివృద్ధి చెంద టానికి ఆస్కారం లేకుండా పోయినై.

కాని మనం దీనివలన విచారపడి కర్తవ్యమూఢులం కానక్కరలేదు ఇతరుల దగ్గరనుంచి నేర్చుకోనటానికి మనం సిగ్గుపడకూడదు. వెనుక మనదగ్గరనుంచి యితరులు నేర్చు కున్నారు, మొట్టమొదట మనదగ్గర నేర్చుకొని తత్ఫలితంగా నేడు యీదశకు రాగల్గిన వారిదగ్గరనుంచి నేడు మనం ఎందుకు నేర్చుకోనకూడదు ?మనం ఇతరులదగ్గరనుంచి ఏమీ నేర్చుకోకూడదనే తత్వం మంచిదికాదు. కాగా యీతత్వం అభివృద్ధికి ఆటంకం కలిగిస్తుంది. ఇలాంటి దేశభక్తి (నేడు ఇదే దేశభక్తిగా పరిగణించ బడుతుంది) మనకు యెందుకూ పనికిరాదు. చివరకు దీనివల్ల మనం రాజకీయ స్వాతంత్ర్యం కూడా సంపాదించలేము. కనుక బాగా పరిశీలిస్తే, నేడు మన జాతీయవాదంలో ప్రచారంలోవున్న యీసిద్ధాంతం దాని ఆదర్శానికే (రాజకీయస్వాతంత్ర్యం). విరుద్ధంగా వుందని తేలు తుంది.

ఐరోపాఖండంలో మాధ్యమిక యుగాల (జమీందారీ యుగం) సాంఘిక వ్యవస్తను తొలగించి ప్రజాస్వామిక స్వాతంత్ర్యానికి, నూతన సాంఘిక వ్యవస్థకు పునాదిరాయి అయిన యీ తాత్వికవిప్లవ ముఖ్యసూత్రాలేంటో తెలుసు కోటం మంచిది. తాత్వికవిప్లవం అంటే చరిత్రను విమర్శనా దృష్టితో అర్థంచేసుకోడం, వున్న రాజ్యాంగ యంత్రం మీద తిరుగుబాటు జరపటం, మూఢవిశ్వాసాలు నిర్మూలించి

హేతువాదాన్ని నెలకొల్పటం. ఆధునిక ఐరోపాఖండనిర్మాతలు పాత భావాలు, ఆచార వ్యవహారాలు, సంస్థలు, సంస్కృతి —అన్నింటినీ మానవుడు ముందుకు సాగటానికి, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అనుభవించటానికి యెంతవరకు వుపయోగిస్తవో తరచి చూసారు. నిరుపయోగం అనుకున్న వాటి నన్నిటినీ, పూర్వకాలములో అవి ఆదర్శ ప్రాయంగావున్నా, వాటినన్నింటినీ నిశిత విమర్శనకు గురిచేసి సంఘంలోనుంచి తొలగించి వేసారు. మనం మన దారిద్ర్యం, బానిసత్వం, అజ్ఞానం పారద్రోలి మనసంఘాన్ని ముందుకు తీసుకొని వెళ్ళాలంటే మనంకూడా అదేపద్ధతిని అవలంబించవలసి వుంటుంది. యీ మాత్రం చేయటానికి ధైర్యం లేకపోతే దేశభక్తుడ ననుకోటం పొరపాటు. స్వాతంత్ర్యం గమ్యస్థానం అయినప్పుడు ఆ గమ్యస్థానం చేరాలంటే మార్గంలో కలిగే అవరోధాలన్నీ యెదుర్కోటానికి సంసిద్ధపడాలి. లేకపోతే గమ్యస్థానం చేరటం అసంభవం.

కేవలంమన ప్రాచీనసంస్కృతిని, ప్రాచీన ఔన్నత్యాన్ని చూచి మురుసుకుంటూవుంటే ముందు మనం జీవించలేము. ఆకాలం నశించిపోయింది. కాబట్టి దాన్ని పొగడుతూ ఆత్మతృప్తి చెందేపద్ధతినుంచి మనం విముక్తిచెందాలి. గతించిన దాన్ని విడనాడే ధైర్య, సాహసాలు, ఆలోచనాశక్తి మనం తెచ్చుకోవాలి. ఇది ఎంత త్వరగా జరిగితే అంత త్వరలో మనకు లాభంచేకూరుతుంది. శవం ఎప్పటికీ శవమే. అది శరీరం కాజాలదు. కాగా దానివలనచుట్టూవున్న వాతావరణం కూడా దుర్గంధమయమై ప్రమాదానికి దోహదమిస్తుంది.

మనం మనముఖం వెనక్కు త్రిప్పి ముందుకు వెళ్ళాలంటే త్వరగా వెళ్ళలేము. అదేవిధంగా మనం మన ప్రాచీన ఔన్నత్యంతో తృప్తిచెందుతూ కూర్చుంటే మనం అభివృద్ధి చెందలేము. ప్రాచీన ఔన్నత్యాన్ని కేవలం అందులోవున్న సుగుణాలు గ్రహించి వాటిద్వారా ముందుకు సాగటానికే చూడవలసి వుంటుంది. దీనికి మన వెనుకటి చరిత్రను విమర్శనాదృష్టితో చూడవలసివుంటుంది. కాని కేవలం ప్రాచీన ఔన్నత్యాన్ని ఆదర్శంగా తీసుకొని అంతటితో మనం తృప్తిచెందినందువల్ల ప్రయోజనం వుండదు. చరిత్రను మనం సరిగ్గా అర్థంచేసుకోవాలంటే ముందుమనం విజ్ఞానవంతం, విప్లవాత్మకమైన వుద్యమాన్ని సృష్టించవలసి వుంటుంది. నేడు చరిత్రాత్మకంగా మనదేశంలో యీవుద్యమ ఆవశ్యకత యెంతోవుంది. దీని ద్వారానే మన స్వాతంత్ర్యవుద్యమానికి తిన్ననిబాట యేర్పడుతుంది. గత పాతిక సంవత్సరాలనుంచి స్వాతంత్ర్యంకోసం అనేకవుద్యమాలు బయలుదేర్నినై. కాని మనది సరియైనబాట కాకపోవటంచేతనే ప్రతివుద్యమం చూడటానికి బలవత్తరంగా వున్నా, విఫలం కావలసివచ్చింది.

దీనికి సమాధానం యేంటి? మన శత్రువు మనకంటె బలవంతుడు కావంటచేత మనం వోడిపోయామని తేలిగ్గా సమాధానం చెప్పవచ్చు. కాని విమర్శకునకు ఆసమాధానం నచ్చదు. మనం మన స్వాతంత్ర్య వుద్యమాల్ని విమర్శనాదృష్టితో పరిశీలిస్తే అవి విఫలం కావటానికి వాటిలోవున్న పరస్పర విరుద్ధ భావాలే అని గోచరించకమానదు. మన వుద్యమాలు బలవత్తరంగావున్నా, అభివృద్ధి నిరోధక నాయ

కత్వంవల్ల విఫలం కావలసివచ్చినా. మనం మన సంఘాన్ని, ప్రజానీకాన్ని ముందుకు తీసుకొని వెళ్ళటానికి రాజకీయ స్వాతంత్ర్యం కోరుతున్నాము. పరాయిప్రభుత్వంవల్ల ఏర్పడిన బానిసత్వం, దారిద్ర్యంనుంచి సంఘాన్ని తప్పించి ప్రజానీకాన్ని ఆర్థికంగా బాగుచేయటానికి మనం రాజకీయ స్వాతంత్ర్యం కావాలంటున్నాము మనం కేవలం ముందుకు వెళ్ళటానికే రాజకీయ స్వాతంత్ర్యం కావాలంటున్నాం. కాని వెనక్కు వెళ్ళ టానికి మాత్రంకాదు. అయితే మన స్వాతంత్ర్య వుద్యమ సిద్ధాంతాలు యిందుకు దోహదం కల్పించటం లేదు. ఇవి కేవ లం ప్రాచీనఔన్నత్యాన్ని స్తుతించటానికే కల్పించబడ్డవి ప్రా చీనభావాలు, ఆచార—వ్యవహారాలు, సంప్రదాయాలు తిరిగి నెలకొల్పటానికేయీసిద్ధాంతాలు కల్పించబడ్డవి. ఇది కేవలం వొక్క భారత దేశానికేకాదు. భావిప్రపంచానికంతటికీ యీ సిద్ధాంతాలే తగిన మందని మన నాయకులు ప్రచారం చేస్తు న్నారు. ఒకప్రక్క మనం బానిసత్వంలోవుండి స్వాతంత్ర్యం కోసం పెనుగులాడుతూ మరొకప్రక్క ప్రపంచాన్ని రక్షించ టానికి మేమే తగినవారమని చెప్పటంకంటె హాస్యాస్పదమైన విషయం మరొకటివుండదు. కాని మన దేశనాయకులకు యీవైరుధ్యం గోచరించటంలేదు. సాధారణంగా మనదేశీయ నాయకుల్లో ప్రతివొక్కరూ యిదేదృష్టితో భావి ప్రపంచాని కంతటికీ మన ప్రాచీన సంస్కృతితప్ప మరొకటి ఆదర్శప్రా యం కాజాలదనే నమ్మకంలో వున్నారు.

విజ్ఞానాన్ని రేకెత్తించటానికి యిది పద్ధతికాదు. దీని వల్ల ప్రజల మనస్సుల్లో రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థి

కంగా, నైతికంగా అన్నివిధాలా ముందుకు వెళ్ళటానికి కావల సిన భావాలు చొప్పించటానికి యేవిధమైన ఆస్కారం వుండదు. సిద్ధాంతరీత్యా జాతీయవాదం వెనక్కు నడుస్తున్న మోటారు కారువంటిది. కారును వెనక్కు నడుపుతూ ముం దుకు వెళ్లాలంటే అసంభవం. భావివ్యవస్థకోసం ప్రాచీన వ్యవస్థనుంచి ఆదర్శప్రాయంగా తీసుకోటం వొక్క భారత దేశసాంప్రదాయమేకాదు. ఐరోపా ఖండంలోకూడా 18వ శతాబ్దంలో బయలుదేరిన వుద్యమనాయకులుకూడా యిదే అవస్థలో పడ్డారు. కాని గతించినదాన్ని తిరిగి పునరుద్ధ రించటం అసంభవమని చరిత్ర రుజువుచేసింది. ఫ్రెంచితత్వశాస్త్రజ్ఞుడైన రూసో మానవుడు ఆదిలో స్వతంత్రు డని, అలాంటి స్వాతంత్ర్యం (Natural freedom) కావాలని ప్రచారం చేసాడు. కాని ఆచరణలో అంతకుముందు మానవ సంఘం అనుభవించని నూతన స్వాతంత్ర్యానికి అతడు మార్గ గామి అయ్యాడు. ఆధునికంగా ఫ్రాంసులో స్థాపించిన ప్రజా స్వామిక సూత్రాలకు, ప్రాచీనకాలంలో గ్రీక్‌లో స్థాపించబడ్డ ప్రజాస్వామిక సూత్రాలకు యేమీ సంబంధం లేదు. మన సంఘంలోకూడా యీతేడా వుండక తప్పదు. కాబట్టి యీ అనుభవాన్ని ఆధారంగా తీసుకొని మనభావి వ్యవస్థలో మన మనబాధ్యతను గ్రహించాలి. ఐరోపాఖండంలో జరిగిన తాత్విక విప్లవ అనుభవమంతా నేడు మనముందువుంది. కాబట్టి యీ విప్లవాన్ని మనం వారికంటే తేలిగ్గా జరపవచ్చు.

ఆ వుద్యమ నాయకులు జమీందారీ సాంఘికవ్యవ స్థను తొలగించటానికి తిరుగుబాటు చేసారు. కాని దానికి

మారుగా యెలాంటి వ్యవస్తనుస్థాపించాలో వారికి తెలియదు. వారికి భావివ్యవస్త అగోచరంగా వుంది. కాబట్టి వారు ప్రాచీన కాలభావాల్ని ఆధారంగా తీసుకొన్నారు. వాటి ద్వారా తిరుగుబాటు చేయటానికి కావలసినశక్తి సంపాదించారు. తద్వారావున్న వ్యవస్తను, రాజకీయ అధికారాలను ఆర్థిక వ్యవస్తను అన్నీ తొలగించాలని ప్రచారం చేసారు. తత్ఫలితంగా నేటి ఐరోపాఖండ సమాజం యేర్పడ్డది. నేడు మనం మనభావి వ్యవస్తను వారిలాగా నిర్మించటానికి అయోమయావస్థలో పడనక్కర్లేదు. వారు నిర్మించిన సంఘం మన ముందు వుంది. ఇక మనకు కావలసింది వారిలాగా మనం కూడా ముందుకు నడవటానికి కావలసిన ధైర్యం, శక్తిసంపాదించుకోటం. ఆధునికవిజ్ఞానం అంటే అది కేవలం పాశ్చాత్య విజ్ఞానం అని యేవగించుకోటం పొరపాటు. అది వాకరిసొత్తు గాదు. మానవుడు సంఘాన్ని ముందుకునడిపి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు అనుభవించటానికి చేసినకృషి ఫలితం అది. కాబట్టి మొత్తం మానవ సమాజానికంతటికీదానిమీదఅధికారంవుంది.

ప్రజానీకం సుఖపడాలంటే నేటి సాంఘిక వ్యవస్త మారాలి. మనం రాజకీయంగా జరిపే పోరాటం యిందుకే. సాంఘిక పరిణామం ఒకదాన్నాధారం చేసుకొని మరొకటి జరుగుతూ వుంటుంది. కాని గుండ్రని చక్రంలాగా ఒకే అవస్తతో తిరుగుతూ వుండదు. గతించినదాన్ని ఆధారం చేసుకొని ప్రస్తుత వ్యవస్త యేర్పడ్డది. ఆవ్యవస్త పనికిరాకపోటంచేతనే మానవుడు యీ వ్యవస్తను నిర్మించుకున్నాడు. యీ వ్యవస్తకూడా పనికిరానప్పుడు యింతకంటె మంచి వ్యవస్తను నిర్మించుకో

వలసి వుంటుంది. కాని తిరిగి పనికిరాక వొదలిపెట్టిన వెనుకటి వ్యవస్థకోసం దేవులాడటంకంటె తెలివితక్కువపని మరొకటి వుండదు. అజ్ఞానంలోవుండి మంచి, చెడ్డలను తెలుసుకోలేని సాధారణ ప్రజానీకానికి యీ విషయం అర్థంకాదు. విద్యావంతులై విజ్ఞానాన్ని సంపాదించి ప్రపంచచరిత్ర గమనాన్ని, సాంఘిక పరిణామాన్ని గ్రహించ గలిగిన స్వాతంత్ర్యవాదులు యీసంస్కారవాదాన్ని యెదుర్కొని దీనిలోవున్న మోసాన్ని ప్రజలకెరుక పరచాలి.

కాబట్టి మన బాధ్యతను మనం గ్రహించాలి. భారత దేశంలో నూతనసాంఘిక వ్యవస్థ నిర్మించవలసిన అవసరం యెంతో వుంది వేదకాలానికివెళ్ళి రాట్నం చేపట్టాలనటం తిరిగి సంఘాన్ని అన్ని వేలసంతర్సారాల వెనక్కునెట్టటం అవుతుంది. మానవుడు యంత్రం సృష్టించట ప్రారంభిస్తే అతని తెలివితేటలనుబట్టి ఆ యంత్రంకూడా అభివృద్ధి చెందుతూ వుంటుంది. అడు రాట్నం సృష్టించినప్పుడే అతని భావిజీవిత మంతా అందులోనే యిమడ్చబడ్డది. ఆ రాట్నాన్ని ఆధారం చేసుకొనే నేడు అతడు పెద్ద, పెద్ద కర్మాగారాలు సృష్టించ గల్గాడు. యీ విధంగా సాంఘిక పరిణామం ఒకదాని కొకటి ఆధారంచేసుకొని జరుగుతూ వుంటుంది. కొంతవరకు సృష్టించి యిక అంతటితో ఆగాలనుకుంటే, అది ఆ సృష్టి నిర్మాత అయిన మానవునికే చేతకానిపని. అది ప్రకృతికి విరుద్ధం.

యేపనైనా తెలిసిచేస్తే అదిసులభంగా నెరవేరుతుంది. కాబట్టి మహాప్రపంచంలోపడి తెలియని దానికోసం వెదకు లాడటంకంటె కండ్లు తెరచి కనపడే వస్తువుకోసం బయలు

దేరటం మంచిది. నేడు భారతదేశపరిస్థితులు యిదే ధోరణిలో వున్నవి. నేటినాయకత్వం నిజమైన ప్రజానాయకత్వం కాక పోవటంచేత ప్రజలు అజ్ఞానాంధకారంలోపడి యేంచేయాలో తోచక నలిగిపోతున్నారు. మనదేశంలో ఐరోపాఖండంలో మాదిరిగా తాత్వికవిప్లవం జరక్కపోటంచేత మనవుద్యమం సుడిగుణ్ణంలో పడ్డవస్తువులాగా దరి, దాపులేకుండా వుంది. దీనికి ప్రధాన కారణం. మనదేశంలోమతానికి ప్రాముఖ్యమిచ్చి హేతువాదంతో దానికినూతనస్వరూపం యివ్వబడుతుంది. యీ తత్వం విద్యార్థికుల్లో బాగా ప్రబలంగావుంది. ప్రజల్లో నూతనభావాలు కల్గించి, నూతనవ్యవస్తను నిర్మించ కల్గిన శక్తి, సామర్థ్యాలు వారిలో లోపించటంచేత వారు సంఘ సంస్కరణతోనూ, మత ప్రచారంతోనూ కాలం గడుపు తున్నారు. యీ విధంగా వారు జీవితాన్ని గడపుతున్నంత కాలం, వారు చరిత్రవారికి ఆదేశించిన కార్యాన్ని నెరవేర్చ లేరు. అంటే వారిని నాస్తికులు కావాలని, నాస్తికవాదం ప్రచారం చెయ్యమని నేను చెప్పటం లేదు. ప్రతిదాన్నీ విమర్శనా దృష్టితో ఆలోచించి మంచిదనుకున్న దానికోసం కృషిచేయటానికి కావలసిన పట్టుదల, ధైర్యం వహించాలనే నా సలహా. మనం పాశ్చాత్య సంస్కృతిని గ్రుడ్డిగా అనుసరించగూడదని మననాయకులు చెప్పుతూ వుంటారు. అదే విధంగా మనప్రాచీన సంస్కృతినిగూడ మనం గ్రుడ్డిగా అనుసరించక హేతువాదంతో యెందుకు పరిశీలించగూడదు? చదువుకున్న యేవ్యక్తికూడా నేటి భారతప్రజానీకం ఆధ్యాత్మికంగా వున్నతదశలో వుందని చెప్పజాలడు. నేడు ప్రజా

నీకంలో వ్యాపించినఅజ్ఞానం, పిచ్చినమ్మకాలూ, వాటికి సంబం ధించిన మూఢాచారాలు యెవరూ కాదనలేరు. నిజంగా వీటిని మనం తొలగించాలంటే, వీటికి కారణాలు కనుక్కొని వాటిని రూపుమాపే ధైర్యం మనలో వుండాలి. నిష్పాక్షి కంగా మనం ఆలోచిస్తే వీటన్నింటికిమూలం, మతం ప్రధా నంగా తీసుకొని జరిగే ఆచార, వ్యవహారాలు, సాంప్రదా యాలు అని తేలుతుంది. కాబట్టి వీటిని తొలగించాలంటే మతాన్ని సంస్కరించటానికి ప్రయత్నిస్తే ప్రయోజనం వుండదు. మతాన్ని హేతువాదంతో పరిశీలించి సంఘపురోభి వృద్ధికి పనికివచ్చే సిద్ధాంతాలు స్వీకరించి తక్కిన వాటిని విసర్జించాలి.

కాబట్టి దేన్నికూడా మూఢంగా నమ్మవద్దు. ప్రతివిష యంలోనూ లోతుకుదిగి సవిమర్శనతో, నిష్పాక్షికంగా ఆలో చించే బుద్ధి అలవరచుకోవాలని నా సలహా. ప్రస్తుత వ్యవ స్తను సమూలంగా తొలగించే ధైర్యం మీలో లేకపోతే కనీసం యీ వ్యవస్తకు కారణాలేంటో, వేటిని ఆధారం చేసు కొని యీవ్యవస్త నిలవగలుగుతుందో ప్రశ్నించండి. మీకు తెలియకుండా యెక్కడో వొకశక్తి వుందని, ఆశక్తికి మీరు బానిసలయినంత కాలం మీరు స్వతంత్రులు కాజాలరు. మానసికంగా స్వతంత్రబుద్ధి కలవారే యేప్రజా వుద్యమా నైనా నాయకత్వం వహించి నడపటానికి అర్హులు. విజ్ఞాన వంతులు ముందు మానసికంగా స్వతంత్రులు కావాలి. అప్పుడే వారికి సంఘంలో తగిన స్థానం లభిస్తుంది.

మన ప్రాచీన సంస్కృతి చాలా గొప్పది కావచ్చు. కాని దానివల్ల మన ప్రస్తుత దీనావస్థను కప్పిపుచ్చ లేము. అలా చేయటం మనల్ని మనమే మోసగించుకోటం అవుతుంది. మన యీదీనావస్థను మనం నిర్మించబొయ్యే నూతన వ్యవస్థ ద్వారా తొలగించ వలసిన బాధ్యత మనమీదవుంది. యేవస్తువైనా, యెంత విలువ గలిగినదైనా యెప్పుడో వొకప్పుడు నశించక తప్పదు. అందుకు విలపించటం భావ్యంకాదు. అది అజ్ఞానులు, పిరికిపందలు చేయవలసినపని. గతించిన ప్రాచీన సంస్కృతికి దాసులైనవారు భావి సంఘానికి నాయకులు కాజాలరు. కాబట్టి విప్లవ భావాలు వుప్పొంగుతున్న యువకులు ముందుకువచ్చి భారత ప్రజానీకం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పొంది వుచ్ఛదశకు చేరటానికి నాయకత్వం వహించాలి.

---

# మతం - మూఢవిశ్వాసం

మహాత్మాగాంధి ఒకప్పుడుతననిరసనవ్రత(అస్పృశ్యతా నివారణకు) అంతిమసమయంలో యీ విధంగా చెప్పాడు—"యీ ఐదురోజుల్లోనూ దేశంలో కలిగినమార్పు, చైతన్యం నాకెంతో ఆశ నుకల్గిస్తుంది. హిందూమతంలో సనాతనత్వంగతించి యింతవరకూ చీడపురుగుగానున్న అస్పృశ్యతతొలగిపోతుంది." కాని వెంటనే "హిందూమత భావాల్ని విప్లవపూరితం చేయుటం నా అభిమతం కాదు" అని కూడా మహాత్ముడు చెప్పాడు. ఒకే సమయంలో, ఒకఆదర్శంకోసం యిచ్చిన యీ అభిప్రాయం పరస్పర విరుద్ధంగా కనబడుతుంది. ఒకపక్క సనాతనత్వం తొలగాలంటూ మరొకప్రక్క సాంఘిక భావాల్ని విప్లవపూరితం చేయాలని తన అభిమతం కాదని మహాత్ముడు చెప్తున్నాడు. సాంఘికభావాల్ని మార్చకుండా సనాతనత్వం తొలగించటం అసంభవం. అది పాము - చావకుండా బడితఇరగకుండాచేసే వ్యవహారం.

ఒక్క అస్పృశ్యతేకాదు, ఆ విధంగా మనసంఘంలో చీడపురుగులాగా వుండి సంఘాభివృద్ధిని అరికట్టుతున్న మూఢవిశ్వాసాలన్నీ తొలగించాలంటే మనభావాలు పూర్తిగా విప్లవపూరితం చేయవలసి వుంటుంది. కాని యిది కేవలం నిరసనవ్రతంతో (యిదికూడా ఒకమూఢ విశ్వాసమే) చేసే పని కాదు. భావవిప్లవం అంటే హిందూమతంలోని మూఢవిశ్వాసాలు,సనాతనత్వం, నాశనం కావటం. మూఢవిశ్వాసం,

యేవగింపు మతానికి పునాదులు. వీటిని తొలగించు. మతం, దానిమీద నిర్మించబడ్డ సాంఘికవ్యవస్థ నామ, రూపాలు లేకుండా పోతుంది. ఇది తక్కిన మతాలకంటే హిందూమతానికి యెక్కువగా అన్వయిస్తుంది. కారణం — హిందూమతం కొన్ని ప్రత్యేక మతసిద్ధాంతాలమీద కాక కేవలం మూఢవిశ్వాసం మీద, పిచ్చినమ్మకాలమీద ఆధార పడివుంది. వీటి నాధారంచేసుకొనే జాతీయవాదులు హిందూ మతం తక్కినవాటికంటే భిన్న అని తృప్తిచెందుతూ వున్నారు. కేవలం మతదృష్టితో చూచినా హిందూమతం తక్కిన మతాలకంటే వెనుకబడి వున్నదని చెప్పక తప్పదు. ఏకత్వ సిద్ధాంతం (ఒకేదేవుడు) మతంలో అంతిమదశ. యీ దశను యింతవరకు హిందూమతం చేరలేదు. మనకు ముప్పైమూడు కోట్ల దేవుళ్లున్నారు

ప్రతిమతంలోను ఏదోవొక దేవుడో, లేక కొంతమంది దేవుళ్లోవుండి వారే భౌతికప్రపంచంలో జరిగే కార్యకలాపాలకు కర్తలుగా పరిగణించ బడుతున్నారు. యెప్పుడైతే మానవుడు తనశరీరాన్ని, మనస్సును దేవుని కప్పగించి వేస్తున్నాడో, అప్పుడే అతని హేతువాదం మూఢవిశ్వాసానికి బలి చేయబడుతుంది. దైనందిన జీవితంలో గడిస్తున్న ప్రపంచానుభవం, జ్ఞానం అతనికి దూరమైపోతవి. అతనికి అంతా దేవుని లీలగా కనబడుతుంది. అతనిలో విమర్శనాజ్ఞానం నశిస్తుంది. చివరకు సత్యం తెలుసుకోవాలనే జిజ్ఞాస అతనికి రోతగా కనబడుతుంది.

యీ తత్వం కేవలం ఒక్క భారతదేశ ప్రత్యేకతకాదు.

ప్రతిమతంలోనూ యీతత్వంవుంది. ఉదాహరణకు క్రైస్తవ మత సంస్థాపకుల్లో వొకరైన టెర్టులియన్ యీవిధంగా చెప్పాడు. "గ్రీకు తత్వవేత్తలు దేన్నిగురించి (భౌతికం) తలలు పగలకొట్టుకున్నారో అది సాధారణ క్రైస్తవునికూడా ఒక సమస్యగాదు." ఇదేవిధంగా తత్వశాస్త్రాన్నిగూర్చి సాధారణ యే హిందువునైనా అడగండి, అతడు వెంటనే స్వామీ వివేకానందుడు చెప్పినట్లు "మనకు అది సమస్యకాదు. పాశ్చాత్య విజ్ఞానం యెక్కడైతే ఆగిపోతుందో ఎక్కడనుంచి మన విజ్ఞానం (పరలోకం) బయలుదేరుతుంది" అని తేలిగ్గా సమాధానం చెప్తాడు. యీ యేవగింపే మతాన్ని బలపరుస్తుంది. కాగా దాన్ని అన్నిటికంటె వున్నతపథంలో చేరుస్తుంది. సాధారణంగా విద్యావంతు లనుకున్నవారుకూడా విజ్ఞానం (సైన్సు) ద్వారా ప్రమాణం చూపిస్తున్నా అంగీకరించరు. దీన్నిబట్టి చూస్తే మతానికి పునాది అజ్ఞానం అని, భగవంతుడు యీ అజ్ఞానాంధకారంలో రాజ్యం చేస్తూవుంటాడని తేలుతుంది.

మానవుని ఒక దశలో మతం అతని సాంఘికవ్యవస్థను తెలుపుతూవుంటుంది. మానవుడు అజ్ఞానదశలో వున్నంత కాలం మతం అతని సిద్ధాంతం. కాని కేవలం అజ్ఞానం, మూఢ విశ్వాసం, యేవగింపుతో కూడుకొనిన మతం యెల్లకాలం అదేరీతిగా వుండటానికి వీల్లేదు. సంఘం మారుతున్నకొద్దీ మతంకూడా మారుతూవుంటుంది. కాబట్టి సంఘం యే పరిస్థితుల్లో వుందో తెలుసుకోవాలంటే, ఆసంఘంలోవున్న మతం యేస్థితిలోవుందో తెలుసుకుంటే చాలు. నాగరికతకు మతం వొక కొలతబద్ద.

ఆదిలో మతం పుట్టలు, రాళ్లు, రప్పలు, మృగాలను, పూజించే రూపంలో బయలుదేరింది. తరువాత మతంలో మానవుని కర్థంగాని శక్తులు (ఉరుములు మెరుపులు మొదలైనవి] ఒక్కొక్కశక్తిని ఒక్కొక్క దేవునిరూపంలో సృష్టించింది. భయంనుంచి మూఢవిశ్వాసం బయలు దేరుతుంది. ఈ మూఢవిశ్వాసం మానవుని ఆదేవుళ్ళను తృప్తిపరచటానికి కానుకలు కట్నాలు, బలులు ఇచ్చేటట్లు చేసింది. ఈతతంగమే చివరకు సంఘంలో మతాధిపతులనే పేరుతో ఒక ప్రత్యేక వర్గాన్ని సృష్టించి వారు దేవదూతలు అనేభావం కలిగించింది. సంఘంలో వారికున్న గౌరవభావంవల్ల వారు అధికారాన్ని చేపట్టి, మొత్తం సంఘాన్ని తమ చేతుల్లో అట్టిపెట్టుకొని వారి కష్టార్జితంమీద తాము సుఖంగా జీవించసాగారు. వీరు తమ అధికారం సుస్థిరం చేసుకోటానికి ప్రజల్లో యింకా మూఢ విశ్వాసాలు చూపించారు. క్రోధపూరితులైన దేవుళ్ళను తృప్తిపరచేశక్తి, దైవసహాయ్యం తీసుకొని ప్రజలకు మేలు చేసేశక్తి వీరిలోవుంది. వారికి మంత్రబలంవుంది. దాంతో వీరు నిత్యం దేవుళ్లతో మాట్లాడుతూ వుంటారు అని నమ్మబడింది. యిదే చివరకు వారి వాక్యం వేదవాక్యం చేసి వారి కనుకూలంగా సంఘంలో ఆచార వ్యవహారాలు, క్రతువులు, సంస్థలు మొదలైనవి నిర్మించబడ్డవి.

మానవుని విజ్ఞానం పెరుగుతున్నకొద్దీ అతనికి ఈమూఢ విశ్వాసాలు, రాళ్ళు, రప్పలు మొదలైన చిల్లర దేవుళ్ళు తృప్తినివ్వలేవు. అందుకని అతడు యింకా ముందుకు వెళ్ళి ప్రకృతి రహస్యాలను కనుకోటానికి ప్రయత్నిస్తాడు. యీ

జిజ్ఞాస అంతవరకువున్న, పీఠాధిపతుల అధికారాన్ని సాంఘిక వ్యవస్థను యెదిరిస్తుంది. మానవుణ్ణి భౌతికవాదంతోనూ తత్వదృష్టితోనూ, ఆలోచించే మార్గంలో పెట్టుతుంది

కాని యీ విధంగా అభివృద్ధిచెందిన విజ్ఞానం సమాజాన్ని వొక్కసారిగా మూఢ విశ్వాసంనుంచి తప్పించలేదు. సాధారణ ప్రజానీకం యీ ఆలోచనాశక్తినుంచి దూరంగానే వుంటుంది. మతం తన అధికారాన్ని నిలుపుకోటానికి నూతన స్వరూపం దాలుస్తుంది. చిల్లర దేవుళ్ళస్థానంలో 'ఒకేదేవుడు' ప్రవేశించి యీ బ్రహ్మాండమంతటికీ సృష్టికర్త అవుతాడు మూఢవిశ్వాసం దివ్యదృష్టిని సంపాదిస్తుంది. దివ్యదృష్టిని రుజువు చేయటానికి అనేక అభూత కల్పనలు, అద్భుతకార్యాలు చేయవలసి వుంటుంది. యీవిధంగామతం తిరిగి సంఘంమీద అధికారాన్ని నిలుపుకుంటుంది.

'ఏకత్వ సిద్ధాంతం' నిలవాలంటే అంతకుముందు చిల్లరదేవుళ్ళ కనుకూలంగా నిర్మించిన సంఘం, సంఘంలో ఆచార వ్యవహారాలు, క్రతువులు, సంస్థలు నిర్మూలనమై సంఘమంతా దీని కనుకూలంగా పునరుద్ధరించాలి. అందుకని యీసిద్ధాంతం వెనుకటి మతాన్ని ఖండిస్తుంది. ఆ మతాన్ని మౌఢ్యం అని నిరసిస్తూ యీమతం మరొక మూఢవిశ్వాసాన్ని చూపిస్తుంది.

కాని మానవసంఘాభివృద్ధికి ఒకదశలో యిది విప్లవ భావం అని అంగీకరించక తప్పదు. దరి, దాపు లేక నానారకాలుగా, నానా మార్గాల్లో నడుస్తున్న సమాజాన్ని ఒకే మార్గంలో—అదికూడా మూఢవిశ్వాసం అయినా—నడపటం

అప్పటిసమాజంలో తప్పలేదు. పాశ్చాత్య దేశాల్లో ఏసుక్రీస్తు, తరువాత మహమ్మదు సృష్టించిన యీవాదమే చివరకు ఆధునిక పాశ్చాత్య సంస్కృతికి పునాదులైనవి.

మనదేశంలో వేదమతము మొట్టమొదట మతం. రాను రాను అప్పటి సాంఘిక వ్యవస్థ, ఆచార వ్యవహారాలు మార్పుచెందుతూ వచ్చినై. మహాభారతయుద్ధం అంతిమ దశలో, క్షత్రియజాతి అంతా పతనం చెందటంతో యీ దశ పూర్తిఅయింది. కాని ఆ అరాచక వ్యవస్థనుంచి మరొక నూతనశక్తి పుద్భవించలేదు. తిరిగి బ్రాహ్మణ అధికారమే గతి అయింది అందుకనే యితరదేశాల్లో మాదిరిగా చిల్లర దేవుళ్ళనుంచి 'ఒకేదేవుని' వాదం అభివృద్ధి చెందటానికి మారుగా యిక్కడ స్మృతులు, పురాణాలు, బయలుదేరి తిరిగి సంఘం అవ్యక్తావస్థలో పడిపోయింది. తరువాత బౌద్ధ మతం కొంతవరకు భౌతికవాద దృష్టితో బయలుదేరింది. కాని బ్రాహ్మణమత ఫలితంగా సంఘంలో వ్యాపించిన మూఢ విశ్వాసాలు పూర్తిగా తొలగలేదు. కాగా వారు తిరిగి వేదాన్ని ప్రమాణగ్రంథంగా చూపించి తమ అధికారాన్ని పునరుద్ధరించుకోసాగారు. యీరెంటిమధ్య దాదాపు వెయ్యి సంవత్సరాల పోరాటం జరిగి చివరకు బ్రాహ్మణమతం జయించింది. ఇది హిందూదేశ చరిత్రలో విచారకరమైన సంఘటన. బౌద్ధమతం వోడిపోవటానికి కారణం, అది ఏకదేవుడి సిద్ధాంతానికి మారుగా శూన్యవాదాన్ని చూపింది. కాగా యీ వాదంకూడా సంఘాన్ని మూఢవిశ్వాసంనుంచి తప్పించేటంత ప్రబల, శక్తిగా, అభివృద్ధి చెందలేదు. చివరకు బౌద్ధ

మతం సంఘాన్ని దేన్నుంచి తప్పించడానికి పోరాడిందో దాని వల్లనే నాశనమై పోయింది.

యీవిధంగా జయంపొందిన హిందూమతం శంకరాచార్యుని అద్వైత సిద్ధాంతంతో తిరిగి సంఘంలో మూఢవిశ్వాసాలు, ఆచార వ్యవహారాలు చొప్పించింది బౌద్ధకాలంలో చాలావరకు వేదకాలంలోని ఆచారవ్యవహారాలు, సంస్కృతి మార్చబడ్డవి. మిగిలివున్నవి శంకరునిచే ఖండించబడ్డవి. కాని హిందూమతాధికారం వెనుకటి మాదిరిగా బ్రాహ్మణజాతి చేతుల్లో నిలిచిపోయింది. ప్రజానీకానికి ప్రత్యేకించి యేమతంలేదు. వారికి స్మృతులు, పురాణాలు, మూఢవిశ్వాసాలు, వర్ణవ్యవస్థ, అస్పృశ్యత, విచారం మొదలైనవి అప్పగించబడ్డవి.

ఇప్పటికి వేలసంవత్సరాలు గడిచింది. కాని హిందూ సంఘంలో ప్రజల్లో అప్పటికీ, యిప్పటికీ పెద్దమార్పు యేమీ లేదు. అప్పుడున్న ఆచారవ్యవహారాలు సాంఘిక వ్యవస్థ యిప్పటికీ వున్నవి. హిందూమతంలోని సాధారణ వ్యక్తికి వొక స్పష్టమైన సిద్ధాంతంకాని మతంకాని లేదు. భగవంతుని మీద అతనికున్న భావం యెలాంటిదో అతనికే తెలియదు. భగవంతునికోసం అతనిలో క్రమబద్ధమైన ఆచరణ మృగ్యం. నిజంగా అతడు పూర్తిమతస్థుడు అని చెప్పటంకంటె మతం లేని వాడు అని చెప్పవచ్చును. కాని అతనిలో మూఢవిశ్వాసాలు ప్రకోపించి అతని నిత్యజీవితంలో ప్రతిబింబిస్తూవుంటవి. అతడు మూఢంగా కర్మసిద్ధాంతాన్ని నమ్ముతూ వుంటాడు. నిజంగా కర్మసిద్ధాంతం తర్కబద్ధంగా ఆలోచిస్తే మానవ

జీవితానికి భగవంతుని అవసరమే వుండదు. కాని వేల సంవత్సరాలనుంచి అన్నింటికీ వెనుక భగవంతుడేవుండి నడిపిస్తున్నాడనే విశ్వాసం అతనిలో జీర్ణించుకు పోయింది. అందుకోసం అవసరమైన పూజా-పునస్కారాలు, ఆచారాలు నిర్మించుకున్నాడు. హిందూ సంఘంలోవున్న హెచ్చుతగ్గులు లోటు-పాట్లు అన్నింటినీ 'కర్మ సిద్ధాంతం' అంగీకరిస్తుంది. వెనుకటి జన్మలో చేసిన కర్మసంచయాన్నిబట్టి యీజన్మ యేర్పడుతూవుందని, కాబట్టి యీ హెచ్చుతగ్గులు సహజమని కర్మసిద్ధాంతం బోధిస్తుంది. యీసిద్ధాంతం వొక ఉరికుల రాటంగా తయారయింది. హిందూసంఘం ఇందులోనుంచి బయటపడలేక పోతుంది. కర్మసిద్ధాంతం మానవుని జిజ్ఞాసను చంపి అతన్ని బంధించివేస్తుంది. వేలసంవత్సరాల నుంచివస్తున్న సాంఘిక దురాచారాలను గౌరవించి, వాటికి లొంగిపోవటమే అతని బాధ్యతగా యెంచబడుతుంది.

యిలాంటి వ్యవస్థలో నిరసనవ్రతంతో, సనాతనత్వ అంగీకారంతో అస్పృశ్యతను తొలగించాలనుకోటం తెలివి తక్కువ. యీ సమస్యలతో హిందూసంఘంలోని అనేక సమస్యలతో కలిసివుంది. కాబట్టి దీన్ని ప్రత్యేకించి విడదీసి పరిష్కరించటం అసంభవం. హిందూసంఘంలోవున్న సనాతనత్వం దానికి ఆధారంగా నిర్మించిన సాంఘికవ్యవస్థ మారినప్పుడే అస్పృశ్యత తొలగుతుంది.

కాబట్టి అస్పృశ్యతను మాపుమాపాలంటే మహాత్ముని వుపవాసం-నిరశనవ్రతం పనిచెయ్యవు. హిందూసంఘంలో మతం పేరిట పాతుకుపోయిన మూఢవిశ్వాసాలను పెకలించి

వెయ్యాలి. వీటిని మానవసంఘంలో నిత్యం కనబడుతున్న హెచ్చు - తగ్గులను చూపించివాటిపరిష్కారమార్గంతో పెకలించి వేయవచ్చు. అప్పుడు కర్మసిద్ధాంతం మానవునిజీవిత ఆవశ్యకతను, సుఖంగా బ్రతకాలనే వాంఛను అడ్డలేదు. ఇది యింతవరకు సరిగ్గా జరక్కపోవటంచేతనే మనసాంఘిక వ్యవస్థ యిప్పటికీ యీవిధంగా నిలిచివుంది. కొంతమంది బుద్ధిమంతులు యీ వ్యవస్థను మార్చటానికి ప్రయత్నిస్తున్నా వారిలో దాగివున్న సనాతనత్వం వారిప్రయత్నాన్ని కేవలం నామరూపంలో అట్టిపెట్టుతుంది.

---

# వైరాగ్యం—సన్యాసాశ్రమం

సంఘం అభివృద్ధి చెందాలంటే యెప్పుడూ, అప్పటి సాంఘిక వ్యవస్తనేకాదు, మొత్తం ఆసంఘ చరిత్రనంతా విమర్శనా దృష్టితో పరిశీలిస్తూ వుండాలి. గతించిన దాన్ని బట్టి వున్నవ్యవస్త యేర్పడుతూ వుంటుంది. యేవ్యవస్థనైనా మార్చాలంటే ముందు ఆవ్యవస్త యేర్పడటానికి గల కారణాలేంటోలోతుకుకిదిగిసమూలంగాఆలోచించాలి. ఉదాహరణకు నేటిమనసాంఘిక పరిస్థితులకు కారణం పరాయి ప్రభుత్వంగా చూపబడుతుంది కానిఅంతటితోఆగిపోతేమనపరిశోధన పూర్తి కాదు. విదేశస్తులు మనలను జయించటానికి కారణమేంటి? దీనికూ్డా తప్పనిసరిగా వొక కారణముండాలి. ఆకారణమేంటో, అంతకు ముందువున్న మన చరిత్రనుంచి తెలుసుకోవలసి వుంటుంది.. మనలోవున్న యేదో దౌర్బల్యం చేతనే విదేశీయులు మనదేశాన్ని జయించ గల్గారు. కాబట్టి చరిత్రను యీవిధంగా సవిమర్శనా దృష్టితో పరిశీలించినప్పుడే మనకు ప్రస్తుత సాంఘిక వ్యవస్తకు కారణం కనబడుతుంది. ఆ కారణాన్ని తొలగించినప్పుడే ప్రస్తుత సాంఘిక వ్యవస్త మార్చ గలుగుతాము.

కేవలం గతించిన దాన్ని ప్రశంసిస్తూ ప్రస్తుత బాధలను మరచి పోటానికి ప్రయత్నిస్తే భవిష్యత్తు మన కెప్పుడు అంధకారం గానేవుంటుంది మన జాతీయ వాదంలో మన ప్రాచీనకాలాన్ని గూర్చి ప్రత్యేకంగా ప్రశంసించటం ఒక పరిపాటి అయిపోయింది. “మన ఆధ్యాత్మిక వాదం చాలా

గొప్పది. తక్కిన జాతులకంటె మనజాతి, మనసంస్కృతి గొప్పది" అనే ఆత్మసంతృప్తి, మైకంలాగా 'యితర్లనుంచి మనమేమీ నేర్చుకోనక్కర్లేదనే' భావాన్ని కల్గిస్తుంది. యిది ప్రత్యేకించి ఒక భారతదేశ 'గొప్పతనం' కాదు. మానవసమాజంలో, ఒకదశలో ప్రతిసంఘం దీన్నికలిగేవుంది. సాధారణంగా మనసంస్కృతి యీభౌతిక ప్రపంచాన్ని నిరసించి, ఆధ్యాత్మిక సంపత్తును ప్రోగుచేస్తుందని, అదే మనగొప్పతనం అని భావన వుంది. ఇతరదేశాల్లోకూడా ఒకప్పుడు యిదేసంస్కృతి, యిదే భావనవుందని గ్రహిస్తే మనం అందరికంటె గొప్పవాళ్ళం అనే తత్వం వుండదు. అప్పుడు మనం మనవెనకటి కాలాన్ని మరచిపోయి చరిత్రను విమర్శనా దృష్టితో పరిశీలించి భవిష్యత్తును జయించటానికి పూనుకుంటాము.

"ప్రాచీనకాలంలో క్రైస్తవసన్యాసులు మనుష్యుని పాపిగా, భగవంతుని ప్రతీకారునిగా భావిస్తూ వుండేవారు" (రోమన్ సామ్రాజ్యపతనం - గిబ్బన్) వారిజీవిత సౌఖ్యాన్ని-సంఘబాధ్యతలను త్యజించి బిచ్చాటనంతో, లేక యెవరైనా సమర్పించిన దానితో - సగం ఆకలితో - ప్రాణం నిలుపుకుంటూ వుండేవారు. వారు మాంసం, సారాయి త్యజించారు శరీరం, మనస్సు అన్నివిధాల బాధలకు గురిచేస్తూ వుండేవారు. మానవసహజ వాంఛలైన - ప్రేమ, వాత్సల్యం, ఆనందం, విశ్రాంతి, సుఖం మొదలైనవి పాపపంకిలమని ఖండించబడ్డవి. సన్యాస ఆశ్రమాలు విరివిగా వుండేవి. వేలకొలదిసన్యాసులు "యీ భౌతిక ప్రపంచాన్నుంచి, వైదొలగి యేకాంతవాసం చేస్తూ వుండేవారు. వారికున్న ఆస్తి-పాస్తులు

త్యజించారు...... వారు త్యజించిన ప్రపంచం వారిని గౌర వించ సాగింది. యెంతో వ్యయ, ప్రయాసతో సృష్టించబడ్డ గ్రీకు తత్వశాస్త్రాన్ని గుడ్డిగా త్రోసివేసిన వారివాదాన్ని సంఘం ఆహ్వానించి వారిని పై కెత్తింది" (రోమన్ సామ్రాజ్య పతనం — గిబ్బన్)

యివే పరిస్థితులు మన ప్రాచీన, మాధ్యమిక యుగాల్లో వున్నవి. అంతేకాదు యిప్పటికూడా మనం దీన్నే గొప్పగా భావిస్తున్నాము. క్రైస్తవ మతమేకాదు, అంతకుముందు వున్న పైథాగరియన్లుకూడా యిదేవిధంగా సన్యాసాశ్రమం పుచ్చుకొని భగవంతుని పొందటానికి తపస్సు చేస్తూ వుండే వారు. స్టాయిక్, సినిక్ శాఖలకు చెందినవారుకూడా యిదే విధంగా భౌతికప్రపంచాన్ని, ప్రాపంచికసౌఖ్యాన్ని, నిరసిస్తూ వుండేవారు.

ఏసుక్రీస్తుకి పూర్వం కొన్నివందలసంవత్సరాల ముందు నుంచి యూదుమత ప్రవక్తలుగూడా సన్యాసాశ్రమంలో జీవితం గడపుతూ వుండేవారు. ఇందులో జాన్ది బాప్టిస్టు చివరివాడు. వీరందరూ యీ ప్రపంచాన్ని పాపభూయిష్టమని నిరసించి, దీన్నుంచి విముక్తి చెందటమే జీవితలక్ష్యంగా భావించి, అన్నీ త్యజించి సన్యాసాశ్రమం పుచ్చుకున్నారు. వీరి తరువాత వచ్చిన క్రైస్తవ సన్యాసులు యింతకంటె తీవ్రంగా సన్యాసాశ్రమాన్ని చేపట్టారు...

ఈజిప్టులో యీ క్రైస్తవ సన్యాసాశ్రమాన్ని గిబ్బన్ "మూఢవిశ్వాసానికి పుట్టినిల్లుగా ప్రారంభించిందని" వర్ణించాడు. ఆంథోనీ అనే పేరుగల ఒక నిరక్షరకుక్షి యిక్కడ

ప్రవక్త అయ్యాడు అతడు తల్లిదండ్రులను, కుటుంబాన్ని త్యజించి అడవికివెళ్ళి యేకాంతంగా తపస్సుచేశాడు. అతడే తరువాత పరమాత్మను చూపించగల దేవదూతగా తిరిగి వచ్చాడు. అతన్నిచూచి తరువాత అనేకమంది యిదే విధంగా అడవికి వెళ్ళి తపస్సు చేయటం ప్రారంభించారు. ఆదిలో క్రైస్తవ మతాధిపతులు దీన్ని నిరసించ సాగారు. కాని తరువాత సంఘంలో మతప్రచారానికి యిదొక ఆయుధంగా స్వీకరించ బడ్డది.

అప్పటినుంచి యీ ఆశ్రమాలు లిబియా ఎడారిలోను, థేబియన్ కొండల్లోను, నైలునదీ పొడవున విస్తరించిన పట్టణాల్లోనూ విరివిగా స్థాపించబడ్డవి. యీజిప్టులో యెక్కడ చూచినా సన్యాసులే కనబడసాగారు. ఆంథోని అతనిశిష్యులు దాదాపు 50 ఆశ్రమాలు స్థాపించారు. ఇప్పటికీ యాత్రికులకు అక్కడక్కడా ఆ ఆశ్రమ చిహ్నాలు కనబడుతూవుంటవి. ఆంథోని ఆశ్రమజీవితం యీవిధంగా వుండేది. ఆశ్రమవాసుల్లో వొకరొకరికీ సంబంధంలేదు. యెవరికి వారు ఏకాంతంగా కొండల్లోనూ, ఎడారుల్లోనూ కూర్చుని ప్రార్థన-తపస్సు చేసుకుంటూ వుండేవారు.

ఇతని తరువాత పాచోనియన్ అనే పేరుగల మరొక సన్యాసికూడా కొన్ని ఆశ్రమాలు స్థాపించాడు. యితడు స్త్రీలకుకూడా ప్రత్యేకించి వొక ఆశ్రమం స్థాపించాడు. ఇతని క్రింద ప్రాపంచిక సౌఖ్యాన్ని వదలుకొని, యితని చెప్పుచేతల్లో దాదాపు ఏడైవేలమంది శిష్యులు - శిష్యురాండ్రు వుండేవారు. చుట్టు ప్రక్కల ప్రాంతాలవారుకూడా ఈఆశ్రమ

వుత్సవాలకు-తిరునాళ్ళకు తండోపతండలుగా వస్తూవుండే వారు. యీ భక్తులకు గుళ్ళు-గోపురాలు చాలేవి కాదు. చివరకు కొంతమంది బయట గోడలకే మ్రొక్కు-కొనిపోతూ వుండేవారు. ఒకసారి ఒక చరిత్రకారుని కథనం ప్రకారం, యీజిప్టులోని దాదాపు సగం జనాభా యీ ప్రార్థనల్లో పాల్గొన్నదని తెలుస్తుంది. గిబ్బను తన చరిత్రలో "ఆకాలంలో యీజిప్టులో మనుష్యునికంటె దేవుడు తేలిగ్గా కనబడుతూ వుండేవాడని" వ్రాసాడు.

ఆంథోని శిష్యులద్వారా ఈ సన్యాసిమతం రోములో ప్రవేశించింది. "మొదట్లో యీ అమానుష కృత్యాలను చూచి అక్కడివారు భయపడ్డారు. కాని తరువాత వారే దీన్ని అనుకరించసాగారు. పెద్ద పెద్ద భవనాలన్నీ సన్యాసాశ్రమాలుగా మార్చబడ్డవి." (గిబ్బను) సోమరిపోతుల్లాగా వుండి రాజభోగాలనుభవించేవారికి యిదొక వింతగా, వినోదంగా కనబడి దీనికి దాసోహం అన్నారు.

యీవిధంగా రోమునగరాన్ని ఆంథోని శిష్యులు ఆక్రమించుతూవుంటే, మరొక ప్రవక్త అయిన హిలేరియన్ శిష్యులు సిరియా ఎడారిలో ఒక ఆశ్రమం స్థాపించారు. అక్కడ ఒక సిరియన్ యువకుడుపన్నెండుసంవత్సరాలుఆశ్రమవాసం చేసి, తరువాత తనదేశంలో, పేలస్టయన్‌లో యిదిప్రవేశపెట్టాడు. అతనికి దాదాపు ప్రధానశిష్యులు 2, 3 వేలవరకుండేవారు. అతని తరువాత సైమన్ అతని అధికారాన్ని చేపట్టాడు. ఇతడు గొర్రెలకాపరి. తన పదమూడవ యేటనే యీ ప్రపంచాన్ని త్యజించాడు. అతడు ఇరవైగజాల ఎత్తుగల

ఒక శిఖరంమీద కూర్చొని పదిహేనుసంవత్సరాలు తపస్సు చేసినట్లు, అతడు తన తపస్సమాధినుంచే భగవంతునితో ఐక్యం పొందాడని గాథలున్నవి. ఇతని తరువాత 'బాసిల్' ప్రఖ్యాతి గాంచాడు. యితడు నల్ల సముద్రం బారున అనేక ఆశ్రమాలు స్థాపించాడు.

యిది రోముసామ్రాజ్యంలోనే నిలిచి పోలేదు. క్రీస్తు శకం నాలుగో శతాబ్దంలో యీ భావం ఇంగ్లండువరకు వ్యాపించింది. బ్రిటను - ఎథియోపియా, సిరియన్, పర్షియా మధ్యప్రాంతాల్లో లక్షలమంది సన్యాసులు, సన్యాసినులు వున్నట్లు తెలుస్తుంది.

రోమన్ సామ్రాజ్యం అంతరించింది. సంఘం ఒకదారి, తెన్నూ లేకుండా వుంది. ఎక్కడ చూచినా అసంతృప్తి. యీ భౌతిక ప్రపంచమే వెగటుగా తోచింది. అట్టి పరిస్థితుల్లో యీ సన్యాసాశ్రమం, తపస్సు- ఆత్మతృప్తికి ఒక సాధనంగా కనబడింది. కాబట్టి అందరూ యీ ఆశ్రమాల్లో చేరసాగారు.

కాని భౌతికప్రపంచాన్ని, ప్రాపంచిక సౌఖ్యాన్ని త్యజించిన యీ ఆశ్రమాలు తిరిగి వాటికే స్థావరమైనవి. "భౌతిక ప్రపంచాన్ని త్యజించిన సన్యాసులు తక్కిన మానవులకు మార్గదర్శకులు కావాలి. కాని యింతలోనే గురువులు సింహాసనాలు అలంకరించి రాజభోగాలు అనుభవిస్తూవుంటే శిష్యులు రహస్యంగా త్రాగుడు, వ్యభిచారం మొదలు పెట్టారు." (గిబ్బన్)

ఇదేవిధంగా హిందూసంఘంలోని సన్యాసాశ్రమాన్ని పరిశీలిస్తే యింతకంటె ప్రత్యేకత కనపడదు. హర్షవర్ధనునిచే, చైనాయాత్రికుడయిన హుయన్‌సాంగ్ అధ్యక్షతక్రింద (క్రీస్తు శకం 7 వ శతాబ్దం) జరుపబడ్డ ఒక మతవుత్సవాన్ని గూర్చి హావెల్ యీ విధంగా వర్ణించాడు. "యీ వుత్సవాల్లో నలందా విశ్వవిద్యాలయంనుంచి వచ్చిన సన్యాసులు ఏనుగులమీద, తక్కినవారు పల్లకీల్లో వూరేగించబడ్డారు." యీ వుత్సవాలు ఇరవై రోజులకు పైగా జరిగినవి. యిందులో పాల్గొన్న ప్రతినిధులకు బంగారు నాణాలు, నగలు, సుగంధ ద్రవ్యాలు పంచిపెట్ట బడ్డవి. బౌద్ధకాలంలో యీ సంఘాలు రాజకీయాధికారాన్ని, ధన, ధాన్యాదులు కలిగివున్నవి. తరువాత హిందూదేవాలయాలు, మఠాలుకూడా యిదేవిధంగా నడిచినై. మఠాధిపతులు ఒకప్రక్క అన్నింటినీ వర్జించాలని బోధిస్తూ,వారు రాజభోగాలు అనుభవిస్తూ వుండేవారు. దీన్ని సంఘం హర్షించి వారికి వున్నత పథమిచ్చింది. యిప్పటి కూడా హిందూసంఘం 'సాధువు' కి యిదే గౌరవాన్నిస్తూ వుంటుంది. ఒకప్రక్క దారిద్ర్యంతో క్రుంగిపోతూవున్నా, మరొక ప్రక్క పనిపాటలులేక, సోమరిపోతుల్లాగా తిని కూర్చుంటున్న దాదాపు 50 లక్షల సన్యాసుల్ని నేడు మన సంఘం పోషిస్తుంది. బౌద్ధమతంలో వ్యాపించిన యీసంఘాలు హిందూమతంపునరిద్ధరించబడిన తరువాత ఇంకా విస్తరించబడ్డవి. అప్పటినుంచి యీ సాధువులు — సన్యాసులు విరివిగా బయలు దేరారు.

బౌద్ధసన్యాసి ఉపగుప్తుడు తనరాజ శిష్యుడయిన

అశోకుని కలుసుకొనటానికి వెళ్ళినప్పుడు, పద్ధెనిమిదివేల మంది శిష్యులను వెంటపెట్టుకొని వెళ్ళాడు. పదకొండు లక్షల బంగారు నాణాలను పంచిపెట్టాడు. తరువాత వేయి సంవత్సరాలకు హర్షవర్ధనుని కాలంలో యాచన కోసం అతని దగ్గరకు వచ్చేవారు యింతకంటె హెచ్చు మంది వుండే వారు. కాబట్టి ఆ మధ్య కాలంలో హెచ్చుమంది సర్వసాధారణంగా యీ సన్యాస జీవితాన్నే గడుపుతూవుండేవారని తెలుస్తుంది. మౌర్యకాలంలో యిది వున్నత దశలోవుందని చరిత్ర చెప్పుతుంది. బౌద్ధ సన్యాసాశ్రమం, క్రైస్తవ సన్యాసాశ్రమం రెండూ ఒక విధంగా నడిచినవి. అప్పటి సాంఘిక వ్యవస్థలోని అసంతృప్తి ఫలితంగా ప్రపంచాన్నుంచి దూరంగా వెళ్లి యీ బాధలనుంచి తప్పించుకుందామనే మూఢ విశ్వాసంతో యివి బయలుదేరినై.

వైరాగ్యం అసంతృప్తి చెందిన మానసిక ప్రవృత్తి ఫలితం. ఆత్మహత్య సర్వసాధారణంగా నిరసించబడుతూ వుంది. ప్రపంచమంతా దాన్ని గూర్చి అనుకూలంగా, వ్యతిరేకంగా అనేకవాదనలు బయలుదేరినై. కాని మానవుడు ఒక పిచ్చి భ్రమలో విపరీత పరిస్థితిలో వున్నప్పుడు యిది జరుగుతుందని యిద్దరూ అంగీకరిస్తారు. వైరాగ్యం కూడా యిదే మానసిక ప్రవృత్తికి చెందినది. 'ఆత్మహత్య' భావన హెచ్చుగా సంఘంలో వ్యాపించి వైరాగ్యానికి దారి తీస్తుంది. అక్కడ ఆ వ్యక్తే తన హత్యకు కారణమైతే యిక్కడ ప్రవక్త, గురువు, దేవదూత కారణమౌతున్నాడు. ఆత్మహత్యను అతని విపరీత పరిస్థితులబట్టి అంగీకరించవచ్చు. కాని వైరాగ్యం

అంగీకరిస్తే, మొత్తం సంఘమే నాశనం అవుతుంది. ఒకడు ఒక పొరపాటు చేస్తే అతడు దోషిగా యెంచబడతాడు. సంఘంలో అదే హెచ్చుమంది చేస్తే అప్పుడు అది దోషంగా యెంచబడదు. కాని ఆ ఫలితం సంఘం అనుభవించక తప్పదు. ఇదే విధంగా ఆత్మహత్య నిరసించబడ్డా, సంఘంలో హెచ్చుమంది వైరాగ్యం (మానవుని సహజ బుద్ధులు చంపుకోటం) స్వీకరించటంచేత అది అంగీకరించబడుతుంది. కాని దాని ఫలితం సంఘంలో ప్రతిబింబించక తప్పదు. యీ ప్రపంచం పూర్తిగా బాధామయమని మానవుడు వైరాగ్యం చేబట్టుతున్నాడు. అంటే అతడు తన స్వతస్సిద్ధమైన కర్మలన్నీ త్యజించి వేస్తున్నాడు. అతడు అమానుషకృత్యాలుచేసి పశుతుల్యు డవుతున్నాడు. దాని ఫలితంగా అతడు తనను తాను నాశనంచేసు కోటమే కాకుండా తనచుట్టూ వున్న సంఘాన్ని, భావి సంఘాన్నికూడా నాశనం చేస్తున్నాడు. సంఘంలోవున్న బాధలు, సంఘంనుంచి దూరంగా వెళ్ళితే అవి నశించవు. ఆ బాధలకు వున్న కారణాలు తొలగించినప్పుడే అవి నశిస్తవి.

జీవులు పెరగటం ప్రకృతిసహజం. వైరాగ్యం ఒక విధంగా ఆధునిక 'జన్మ నిగ్రహం' లాగా యీ అభివృద్ధిని అరికట్టుతుంది. పిల్లలను పోషించే స్థితిలో లేనివారు యీ పనికి పూనుకోవచ్చును. ఆ బాధలు లేనప్పుడు యీ ఆవశ్యకత కూడా వుండదు. కాగా యీ 'జన్మ నిగ్రహం' జీవితాన్ని గాని, కామేచ్ఛనుగాని నిరసించదు. పైగా వైరాగ్యంలో వున్న పశుతుల్య జీవనం—మానసిక ప్రవృత్తి యిందులో లేదు. సుడిగుండంలో పడి కొట్టుకుంటున్న మానవుణ్ణి బయటికి లాగు

తున్నాననే మిషతో వైరాగ్యం అతన్ని యింకా అధోగతి పాలు చేస్తుంది. యీ విషమావస్థలో పడి నాశనం అవుతున్న వారికి సంఘగమనం, సంఘాభివృద్ధి పట్టదు.

ప్రాపంచిక బాధలనుంచి జీవిని రక్షించాలనే భావం నిజంగా సర్వోత్కృష్టమైనది. కాని యిదే భావం జీవిని, సంఘాన్ని నాశనం చేయటానికికూడా వుపకరించబడుతుంది. నిజంగా మతం తన భావాలను, ఆదర్శాలను తర్కబద్ధంగా నెరవేర్చదలిస్తే భగవంతుని సృష్టిలో ప్రధానాంగం అనుకుంటున్న మానవుని జీవితానికే ఆటంకంగావున్న ఈకార్యాన్ని విధిగా ఖండించవలసివుంటుంది. భగవంతుడు తన ప్రతిబింబాన్నే మానవుడుగా సృష్టించాడని. మతం చెప్తుతుంది. మానవుణ్ణి మానవత్వంనుంచి దూరం చేస్తున్న యీ వైరాగ్యం నిజంగా భగవంతునికే అపచారం చేస్తుంది. కాబట్టి ఆవిధంగా చూచినా వైరాగ్యం పనికిరాదని తేలుతుంది.

విరాగి పరాజయుడు. చుట్టూవున్న సాంఘికదుస్థితియే అతని పరాజయానికి కారణం. సంఘం మారినప్పుడే యీపరిస్థితులు (దుఃఖం, విచారం. అసంతృప్తి మొదలైనవి) మారతవి. ఐరోపా యీ స్థితినుంచి తప్పించుకొని బయటబడ గలిగింది. దీనిఫలితంగా క్రైస్తవమత సన్యాసులుకూడా గతించారు. అక్కడి సంఘాలు - మఠాలు తమ వెనుకటి దృక్పథం మార్చుకొని మానవాభివృద్ధికి తోడ్పడుతున్నవి. ఇక్కడ యిండియాలో యీదుస్థితి ఒక విషజ్వరంగా పరిణమించింది. దీనిఫలితంగా సంఘంలో అనేక చీడపురుగులు బయలుదేరి ఆ సంస్కృతికి వుపాంగాలుగా పనిచేస్తున్నవి. యీ పరాజ

యాన్ని హిందూసంఘం ఆధ్యాత్మికవాదం అని సంతృప్తి చెందుతూ మానవాభివృద్ధిని అరికట్టుతుంది. సంఘం లో, లోపల కృశించిపోతూవుంది. కాని యీ ఆధ్యాత్మికవాదం విదేశదండయాత్రలను అరికట్టలేకపోయింది. నేడు హిందూ సంఘంలోవున్న బ్రహ్మచర్యవ్రతంకూడా ప్రాచీనకాల ఈసుస్థితికి చెందిన ఆదర్శమే.

ఆదిలో యీ సన్యాసాశ్రమాల్లో మఠాల్లో హెచ్చుగా అనాధులే చేరుతూవుండేవారు. వారు తాము భౌతికంగా త్యజించినదానికంటె పొందగలిగేదే యెక్కువగావుండేది. క్రైస్తవమత ప్రారంభదశలో ఈ సంఘాల్లో చేరినవారిలో హెచ్చుమంది 'ఆస్తి, పాస్తులు పోగొట్టుకొన్న రైతులు, పారిపోయిన బానిసలు, దిక్కులేని అనాధులు' అని చరిత్ర చెప్పుతుంది. వారికి యీ ఆశ్రమాలు జీవిత సాధనంగా కనబడ్డవి. అంతవరకు దారిద్ర్యంతో భుక్తికిలేక నానా బాధలు పడుతూ సంఘంలో నీచంగా చూడబడుతున్న వీరు ఆశ్రమాల్లో చేరగానే, సుఖజీవితం గడపటమే కాకుండా సంఘంలో గౌరవస్థానాన్ని పొందగల్గారు. యీవిధంగా వారు ప్రాపంచిక యీతి బాధల నుంచి తప్పించుకో గల్గారు. ఒకచరిత్రకారుడు యీజిప్టులో 'సాధారణవ్యక్తికంటె సన్యాసి హాయిగా జీవిస్తూవుండేవాడని' వ్రాసాడు. కాబట్టి సన్యాసాశ్రమాలు ఆరోజుల్లో అంతవిరివిగా పెరిగినయ్యంటే యిందులో ఆశ్చర్యంలేదు.

మొదటి రెండువందల సంవత్సరాల వరకు బౌద్ధ సంఘాల్లోకూడా యిదేవిధంగా దరిద్రావస్థ ననుభవించే వారే

చేరారు. దీన్ని గురించి హావెల్ యీ విధంగా వ్రాసాడు. "బౌద్ధమత ఆరంభంలో మొదటి రెండుశతాబ్దాలు ఆ మతం ఆర్యజాతి పైవర్గాలను (బ్రాహ్మణ క్షత్రియ వర్గాలు) ఆకర్షించ లేకపోయింది. యిది తన విప్లవభావాన్ని త్యజించిన తరువాతనే రాజమతం అయింది. అప్పుడు ఈసంఘాల్లో దరిద్రులు చేరటానికి అవకాశం లభించలేదు. రాజశాసనాల నుంచి, సంఘ కట్టుబాట్లనుంచి తప్పించుకోటానికి సంఘాల్లో చేరకూడదని ఒకషరతు పెట్టబడింది. ఋణగ్రస్తులు, శిక్ష పొందినవారు, రాజసేవకులు, బానిసలు మొదలైనవారు చేరటానికి హక్కులేదు." దీన్నిబట్టి అంతకుముందు యిలాంటి వారికి సంఘాలు ఆశ్రయమిచ్చినవని తెలుస్తుంది.

క్రైస్తవమత సన్యాసత్వానికి కారణమైన అప్పటి సాంఘిక పరిస్థితినిగూర్చి గిబ్బను యీ విధంగా వ్రాసాడు. "రోమసామ్రాజ్యంలోని ప్రజలు – ఆప్రభుత్వం విధించేశాసనాలకు నిలవలేక హెచ్చుమంది సన్యాసాశ్రమం స్వీకరించారు... యీ ఆశ్రమాలు ఒకప్రక్క యిలాంటి వ్యక్తులను రక్షిస్తూ మరొకప్రక్క ప్రభుత్వానికి అండగా నిలబడ్డవి." రోమనుచట్టంలో మానవబాధ్యతలనుగూర్చి అనేక శాసనాలు చేయబడ్డవి. కాని యీ ఆశ్రమాల్లో నివసించేవారి మీద మూఢవిశ్వాసాన్ని ప్రచారంచేయకుండా యే శాసనం నిర్మించినట్లు కనబడదు.

హిందూదేశంలోకూడా సరిగ్గా యివే పరిస్థితులున్నవి. దీన్నిగూర్చి హావెల్ యీవిధంగా వ్రాసాడు. "సన్యాసాశ్రమం చాలవున్నత దశగా యెంచ బడింది. క్షత్రియజాతికికూడా యిది

ఆకర్షించింది. దానిఫలితంగా క్షత్రియజాతి బలహీనం కాజొచ్చింది. కాగా దేశరక్షణకోసం వుంచిన ధనమంతా యీ ఆశ్రమాలకోసం వినియోగించబడ్డది... ... అరేబియనులు సింధుదేశాన్ని జయించటానికి కారణం వేలకొలదిజనులు యీ సన్యాసాశ్రమంలో చేరటమే."

బౌద్ధమతాన్ని నాశనం చేయటానికి హిందూ రాజులు బౌద్ధసంఘాలను ధ్వంసం చేసారు. మౌర్యరాజ్యాన్ని కూలద్రోసి సింహాసనాన్ని అధిష్ఠించిన పుష్యమిత్రుడు, హిందూ మతం వుద్ధరించటానికి అశోకునికాలంనుంచి రాజ్యాధికారాన్ని పొంది ప్రాబల్యం సంపాదించిన బౌద్ధసంఘాలను నాశనం చేసాడు. బౌద్ధసన్యాసులను అనేక బాధలకు గురిచేసాడు. అంత జరిగినా సన్యాసత్వం పూర్తిగా నశించలేదు.

అశోకునికాలంలో యీ సంఘాలకు పూర్తిగా సహాయం లభించింది. యివి రాజసహాయ్యాన్నిపొంది సంఘం మీద పూర్తి అధికారాన్ని సంపాదించ గల్గినవి. బౌద్ధమతం రాజాశ్రయాన్ని పొందటంవల్ల యిది తన శూన్యవాదంనుంచి సన్యాసి వాదానికి మారింది. యిదే చివరకు దీనిపతనానికి కారణమైంది. హిందూమతం బౌద్ధసంఘాలను, సన్యాసులను నాశనం చేసినా, తిరిగి తనకాధారభూతంగా ఆశ్రమాలను, మఠాలను స్థాపించింది. బౌద్ధమతాన్ని వోడించిన శంకరుడే ఒకమఠ సంస్థాపకుడయ్యాడు.

బౌద్ధమతంలాగా హిందూమతంలో కూడా ఆదిలో హెచ్చుగా క్రిందివర్గాలనుంచే సన్యాసులు, సన్యాసినులు ఆశ్రమాల్లో చేరినట్లు కనబడుతుంది. సాధువులు, సన్యాసులు

పల్లె, పల్లెలకు వెళ్ళి ప్రచారంచేస్తూ వుండేవారు. దారిద్ర్యావస్థతో తిండిలేక బాధపడే జనానికి వీరివుపదేశాలు మనశ్శాంతిని కలిగించేవి. వారు వీరికి శిష్యులై సన్యాసాశ్రమంలో చేరుతూ వుండేవారు. యీ ఆశ్రమాలు హిందూమతానికి రక్షణస్థానాలుగా యేర్పరచబడ్డవి.

కనుక మనం ప్రపంచ చరిత్రను గమనిస్తే యీ 'ఆధ్యాత్మిక ప్రత్యేకత' ఒక్క భారతదేశానికే కాదు, తక్కినదేశాలు కూడా యీ దశను ఒకప్పుడు అనుభవించినవని తేలుతుంది. పాశ్చాత్యసంఘాలు యీ దశనుంచి తప్పించుకొని ముందుకు పోగల్గినవి. అందుకనే వాటికి, మనకు యింత తేడా కనబడుతుంది. మనంకూడా యీ దశను దాటగల్గినట్లయితే యీ తేడా వుండేది కాదు. అదిచేయలేక పోగా, పైగా మనబలహీనతనే మనం కప్పిపుచ్చుకోటానికి ప్రయత్నిస్తున్నాము.

దీనివల్ల మనకు ప్రయోజనం లేదు. కాగా మన సంఘాన్ని యింకా హీనస్థితిలోనే వుంచటం మాతుంది. కనుక మనం మనగతించిన చరిత్ర కేవలం మాధ్యాంతోకాక విమర్శనా దృష్టితో చదవటం అలవరచుకోవాలి. అప్పుడు మనలోవున్న దోషాలే మనకళ్ళకు కనబడతవి. వాటిని తొలగించుకోటానికి ప్రయత్నిస్తాము. అలా కాకుండా మూఢవిశ్వాసాలతో మనం వున్నంతకాలం మనకు భవిష్యత్తే లేదు.



# నాస్తికవాదం

శూన్యంనుంచి యీ సృష్టి బయలుదేరిందని మతం చెప్పుతూవుంటుంది. బైబిల్‌లో యిది తర్కబద్ధంగా చూపబడింది. భగవంతుడే యీ సృష్టి కంతటికీ కారకుడు. దీన్ని కాదంటానికి వీల్లేదు. కాని యీ సిద్ధాంతంలోనే మతదార్బల్యం కనబడుతుంది. భగవంతుని సృష్టికర్తగా భావిస్తే భగవంతుడు — భగవంతుడనిపించుకోడు: ఆ తనిలో మానవలక్షణం యేర్పడుతుంది. కాని యిదే మతంలో మూలసిద్ధాంతంగా యెంచబడుతుంది.

మానవుని కతీతమైన అద్భుతకార్యాలు (miracles) కూడా క్రైస్తవమతంలో ఒకశాఖగా పరిగణించబడుతున్నవి. యీ వాదాన్ని 'శాస్త్రీయ' మతకర్తలు అంగీకరించరు. హిందూమతం తానొక్క-టేయీగుణాన్ని కలిగివున్నాననిఅంటుంది. ఒకవేళ దీనికి ఆధారముంటే అప్పుడు హిందూమతం, మతంగావుండలేదు;అదిహిందూతత్వశాస్త్రంఅవుతుంది.

విజ్ఞానం— (సైన్సు) విశ్వాసం ఒకదానికొకటి చుక్కెదురు. విశ్వాసంమీద మతం ఆధారపడివుంది. కాబట్టి మతంలో హేతువాదం వుంటానికి వీల్లేదు. ప్రపంచంలో జరిగే అద్భుత కార్యాలు ముఖ్యంగా భగవంతుడే చేస్తున్నాడని నమ్మబడుతుంది. భగవంతుడు సర్వశక్తి సంపన్నుడు. కాబట్టి అతనికే అంతా అంటగట్టబడుతుంది. యీ మూఢవిశ్వాసమే మతానికి పునాది. హిందూసంఘంలో సాధారణంగా ప్రతివ్యక్తీ యిదేనమ్మకంలోవున్నాడు. యీ నమ్మకం

యిప్పటికీ వుండబట్టే హిందూ సంఘం అనాది నుంచీ యిప్పటికీ వొకేవిధంగా వుండవలసి వచ్చింది.

రామాయణం, మహాభారత కథల్లో యీ మానవాతీతమైన అద్భుత కార్యాలు కనబడుతూ వుంటవి. వాటిల్లోని నాయకులు అవతార పురుషులుగా పరిగణించబడ్డారు. హిందువులు ఆ కథలను గుడ్డిగా నమ్ముతూవుంటారు. వారి శక్తిని గూర్చి సందేహించటం పాపంగా పరిగణించ బడుతుంది. వీటి నాధారంగాచూపి నేటివిద్యావంతులు ప్రాచీనకాల భారతదేశ ఔన్నత్యాన్నిగూర్చి ప్రశంసిస్తూ వుంటారు. కాగా ఆధునిక విజ్ఞానం చేయలేని అద్భుతకార్యాలను ప్రాచీనకాలంలో హిందూదేశంలో జరిగినవని, విజ్ఞానంలో (సైన్సు) వొకప్పుడు మనదేశం చాలా వున్నతపథంలో వుందని వాదిస్తారు. వీరికి ఆనాటి సాంఘికవ్యవస్థయెలాంటిదో తెలియదు. కాబట్టి మూఢ విశ్వాసమే వీరి వాదనకు పునాది.

యోగ సిద్ధాంతం కూడా యిదేవిధంగా నమ్మబడుతుంది. ఆధునిక విజ్ఞానం చేయలేనిపని యోగి తన సమాధిలో కూర్చొని చేస్తాడని, అతని కతీతమైన కార్యం లేదని విశ్వసింపబడుతుంది. యీ విశ్వాసం క్రైస్తవ సంఘంలో మాధ్యమికయుగంవరకూవుండేది. హిందూసంఘంలో ఇప్పటికీ యీ నమ్మకంవుంది. సంఘంలో ఏదైనా జబ్బువ్యాపిస్తే వైద్య సహాయానికి మారుగా హిందూసంఘం పోలేరమ్మనో—పుట్టలమ్మనో, లేక 'పీరుళ్ళ'నో కొలిచి నైవేద్యం పెట్టటం యిప్పటికీ మనసంఘంలో ఆచారంగావుంది. సాధువులు, సన్యాసులు చేయలేనిపనులులేవు. యీమూఢవిశ్వాసం ప్రజల్లోవుండబట్టే

యిప్పటికీ యీ సాధువులను పోషిస్తూవున్నారు. వారి గొప్ప దనం వారిలోవున్న మానసిక సంపత్తుకాదు. భగవంతుని మీదవున్న మూఢ విశ్వాసమే వారిని గొప్పవారిని చేసింది. మహాత్మాగాంధీ పలుకుబడి కూడా ఒకవిధంగా యిదే మార్గంలోవుంది. ప్రజానీకం అతన్ని రాజకీయ వేత్తకంటె 'మహాత్ముడనే' దృష్టితో చూస్తూ, అతడు చేయలేని కార్యాలు లేవనే నమ్మకంలో వుంది.

ఆత్మవిశ్వాసం లేనప్పుడు పరుల 'అద్భుత కార్యాల' మీద విశ్వాసం యేర్పడుతుంది. మనలో ఆత్మవిశ్వాసం వున్నట్లయితే నేడు మన సంఘం యీ స్థితిలో వుండేదికాదు. అదిలేకపోబట్టే ఒక 'మహాత్ముని' లీలలకోసం యెదురు చూడవలసి వచ్చింది.

శూన్యంనుంచి (యేమీ పదార్థం లేకుండా) భగవంతుడు యీ ప్రపంచాన్ని సృష్టించాడని, లేక మానవాతీత మైన కార్యాలన్నీ భగవంతుని లీలలని, మూఢంగా నమ్మక పోతే వెంటనే మనకు యీ ప్రశ్న వుదయిస్తుంది. భగవంతుడు యేవిధంగా యీ ప్రపంచాన్ని సృష్టించాడు ? యీ ప్రశ్నే మానవుణ్ణి మతంనుంచి దూరంగా ప్రకృతివాదం, నాస్తికవాదం, భౌతికవాదం—నిజమైనతత్వశాస్త్రానికి తీసుకొని వెళ్లుతుంది.

ప్రాచీనకాలంలో వైశేషిక, సాంఖ్యశాస్త్రాలు యీ ప్రశ్నకు సమాధానం చెప్పటానికి ప్రయత్నించినవి. ఇవే బౌద్ధమతంలోని నాస్తికవాదానికి పునాది అయినవి. వీటిని నాశనం చేయటానికి వేదమతం తన శక్తినంతా ధారపోసింది.

శంకరాచార్యుడు లేవదీసిన యీ పోరాటం చివరకు తన ప్రయత్నంలో సఫలీకృతుడైనా, వైశేషిక న్యాయశాస్త్రాలు వేసిన ప్రశ్న ప్రశ్నగానే నిలబడిపోయింది. శంకరుడు యీ ప్రపంచాన్ని 'మాయ' అని తప్పించుకున్నాడు.

యీ భౌతిక ప్రపంచాన్ని యథార్థంగా కాదని వాదించటమే ఆధ్యాత్మికవాదానికి పునాది. యీ ప్రపంచం అంతా మిథ్య అని, యిది భగవంతుని వొక శక్తి అని, దానికి పుట్టుక వుందికనుక నాశనం కూడా వుంది; కాబట్టి యిది అస్థిరం అని యీవాదం యీ భౌతిక ప్రపంచాన్ని గూర్చి వర్ణిస్తూవుంది. భగవంతుడు వొక మనుష్య ఆకారం గల భగవంతుడని చెప్పుకున్నప్పుడే పై వాటికి విలువవుంటుంది.

ఆధ్యాత్మికవాదం చూపించిన గుణాలన్నీ కేవలం ఆకారం గల వ్యక్తికే సంక్రమిస్తవి. కనుక భగవంతుడు ఆకారం కలవాడని అంగీకరించక తప్పదు. భగవంతుడు అన్ని శక్తులకు అతీతుడని చెప్పబడుతుంది. కాబట్టి అతడు సర్వ స్వతంత్రుడని అంగీకరించాలి. శూన్యంనుంచి యీ బ్రహ్మాండాన్ని సృష్టించగల భగవంతుడు చేయలేని పనిలేదు. అతని శక్తికి హద్దులేదు. కనుక భగవంతుడు సర్వశక్తి సంపన్నుడు, సర్వస్వతంత్రుడు అనే వాదం అంగీకరించాలి. అప్పుడు అవి కేవలం ఆకారంగల వ్యక్తి గుణాలని భావించవలసి వస్తూంది.

ఈ శక్తులు, గుణాలు ఒకవస్తువుకి ఆపాదించినంతవరకు అవి కేవలం వూహాకాల్పితం కాకతప్పదు. కనుక అవి యదార్థం కావాలంటే భగవంతుడు ఒక వస్తువు కావలసివుంటుంది. సర్వస్వతంత్రుడయిన భగవంతునికి శూన్యంనుంచి ఈ బ్రహ్మాం

డాన్ని సృష్టించవలసిన ఆవసరం ఏంటని ప్రశ్నవుదయిస్తుంది. భగవంతుడు వీటన్నింటికీ అతీతుడు. అతనికి సృష్టి చేయవలసిన అవసరంలేదు. ఇది ఆతని లీలగా వర్ణింప బడుతుంది. కాని అతడు సృష్టించవచ్చు, సృష్టించక పోవచ్చు; సృష్టించాలనే బాధ్యత అతనికి లేదు.

ఒక మతంయొక్క మంచిచెడ్డలు ఆ మతంలోవున్న సిద్ధాంతాలు, సాంప్రదాయాలుబట్టి నిర్ణయించబడుతవి. అదే విధంగా ఆధ్యాత్మికవాదం అందులోవున్న పవిత్రతనుబట్టి దాని మంచి, చెడ్డలు నిర్ణయించబడతవి. మతం చూపించిన ప్రకారం, తూచా తప్పకుండా అదేమార్గంలో నడవటం ఆధ్యాత్మిక వాదలక్షణం. మతం బాహాటంగా తాను చెప్పిన సిద్ధాంతాల ప్రకారం - యేమీ మోసంలేకుండా - నడిచినంతకాలం అది సంఘానికి శ్రేయస్సు కలిగిస్తుందని అనుకోటానికి అవకాశంవుంది. కాని మత సిద్ధాంతాలకూ - ఆచరణకు తేడా వున్నప్పుడు దానివల్ల సంఘానికి కీడు కలుగుతుంది.

హిందూమతంప్రకారం భగవంతుడు సర్వస్వతంత్రుడు కాడు. భగవంతుడు నిరాకారుడు, నిర్వికారుడు. అయితే అతడు యీ ప్రపంచసృష్టికి కారణభూతుడు కాజాలడు. అతడెప్పుడు చంచల రహితంగానే వుంటాడు. కాని భగవంతుడు ఆ స్థితి నుండి బయటపడి యీ ప్రపంచ కారణభూతునిగా చూపబడుతున్నాడు. విత్తనం మారి చెట్టుఅవుతుంది. చేతనం మారి జడపదార్థం అవుతుంది. భగవంతుడు తన భగవత్స్వరూపాన్నుంచి మారి భౌతిక ప్రపంచం అవుతున్నాడు. రెండు వస్తువులు - వాటిల్లో సమానగుణాలు వున్నప్పుడే - కారణ కార్య

వస్తువులపటానికి అవకాశంవుంది.

హిందూ ఆధ్యాత్మిక సిద్ధాంతంలోని భగవంతుడు కేవలం చేతనావస్థ అని చెప్పటానికి వీల్లేదు. యీ భగవంతుడు జడపదార్థమయిన భౌతిక ప్రపంచానికి కారణభూతుడవుతున్నాడు. కనుక యీ జడపదార్థగుణాలు భగవంతునిలో తప్పనిసరిగా వుండాలి. కార్యానికిముందు వాంఛ వుంటుందని అందరూ అంగీకరిస్తారు. యీ ప్రపంచసృష్టి భగవంతుని వాంఛగా కనబడుతుంది. అప్పుడు భగవంతుడు 'నిర్వికారం' నుంచి క్రిందకు దిగివచ్చి మానవమాత్రుడవుతున్నాడు. కాని మతం భగవంతుని యీ మానవత్వాన్ని కప్పిపుచ్చి, తన వాస్తవిక తత్వాన్ని కోల్పోతుంది. భగవంతుడు సర్వశక్తి సంపన్నుడు, సర్వస్వతంత్రుడు అని చెప్పినప్పుడు అతనికి మానవ స్వరూపం యిచ్చినప్పుడే ఆ భగవంతుడు నిలువ గలుగుతాడు. కాని అతనికి ఆకారం లేకుండా చేస్తే అతడు తన గుణాలనే కోల్పోయి చివరకు అస్థిత్వంలేకుండా పోతున్నాడు. మతం భగవంతునికి ఆపాదించిన గుణాలే, తిరిగి భగవంతుడు లేడని నిరూపిస్తున్నవి.

"మతం మానవసంఘానికి స్వప్నంలాంటిది. కాని యీ స్వప్నంలోకూడా మనం మోక్షాన్ని పొందలేకపోతున్నాము. మనం వాస్తవికమైన యీ ప్రపంచంలోనే వుండిపోతున్నాం. మనం వాస్తవిక వస్తువులను వాస్తవికాన్నిబట్టి, అవసరాన్నిబట్టి గుర్తించలేకపోతున్నాం. వూహాప్రపంచంలో, కల్పనాశక్తిలో మనం వాస్తవికాన్ని తెలుసుకుంటున్నాము." (క్రిస్టియన్ మతసారం—ఫ్యూయర్ బాక్)

మతం సూచించిన ప్రకారం భగవంతునికి అస్థిత్వం వుంది. దీన్ని కాదనటం భగవంతుని తోసివేయటమే అవుతుంది. భగవంతునికి హేతువాద దృష్టితో కొన్ని అపూర్వ గుణాలను ఆపాదించినప్పుడు, అవి మత సిద్ధాంతంముందు నిలువలేనప్పుడు ఆ భగవంతుడు కూడా నామమాత్రం అవుతున్నాడు. భగవంతుడు కాని, మతంకాని హేతువాదంతో సమర్థించ టానికి వీల్లేదు. కేవలం మూఢవిశ్వాసంమీద ఈ సిద్ధాంతాలు ఆధారపడివున్నవి. హేతువాదంతో వీటిని సమర్థించటానికి పూనుకుంటే, యివి పరస్పర విరుద్ధ భావాలకు గురికాక తప్పదు. మతం ప్రకారం వూహించబడిన భగవంతుడు- సర్వశక్తి సంపన్నుడని హేతువాదంతో రుజువు చేయటానికి వీల్లేదు. భగవంతుని వొక చేతనం లేక శక్తిగా భావిస్తే అప్పుడతడు భగవంతుడు—యీ సృష్టికర్త కాజాలడు. యిలాంటి భగవంతుడు మానవ సృష్టి అవుతాడు.

హిందూ సిద్ధాంతం భగవంతునికి అపూర్వ గుణాలను, శక్తులను అంటకట్టుతుంది. లేక అతన్ని నిరాకారుని, నిర్వికల్పునిగా సూచిస్తుంది. దీన్ని అంగీకరించినా, అతడు సర్వస్వతంత్రుడు కాజాలడు. కారణం అతనికూడా ప్రపంచసృష్టి చేయాలనే వాంఛవున్నట్లు అంగీకరించ తప్పదు. యీ సృష్టివాదం అతని స్వతంత్రాన్ని అరికట్టుతుంది. కాగా యీసృష్టి కేవలం అతనికి వాంఛ వున్నంత మాత్రంచేత జరగదు. యీ సృష్టిని భగవంతునినుంచి వేరుచేయటానికి వీల్లేదు భగవంతుడే సృష్టి, సృష్టియే భగవంతుడని చెప్పాలి. అప్పుడు భగవంతుడు చేతనస్వరూపం కాదు - భౌతికపదార్థ (జడ)

స్వరూపం అని చెప్పాలి. అలా కాకుండా భగవంతుడు కేవలం చేతనస్వరూపం అని వాదిస్తే దానితోపాటు ప్రత్యేక అస్థిత్వం గల్గి, యీ సృష్టికి కారణభూతమైన మరొక పదార్థం వుందని అంగీకరించాలి. అప్పుడు భగవంతుడు తనతోపాటు వున్న పదార్థాన్ని తీసుకొని యీ ప్రపంచాన్ని సృష్టించాడని వొప్పుకోవలసి వస్తుంది. అట్టిపరిస్థితుల్లో అతడు సర్వస్వతంత్రుడు కాజాలడు.

యీ సందిగ్ధావస్థనుంచి తప్పించుకోటానికి హిందూ ఆధ్యాత్మికవాదం జడ పదార్థంయొక్క ప్రత్యేక అస్థిత్వాన్ని ఒప్పుకోదు. చేతనం ఒకటేనని వాదిస్తుంది. అప్పుడు భగవంతుని అస్థిత్వానికే ముప్పువాటిల్లుతుంది. పదార్థంతో కూడిన ప్రపంచం, పదార్థంవల్లనే సృష్టించబడుతుంది. కాబట్టి భగవంతుడు, పదార్థం రెండూ అనాది కారణాలగానైనా అంగీకరించాలి. లేక పదార్థం వొక్కటే మూలకారణం అని ఒప్పుకోవాలి. 'మాయావాదం' ప్రకారం కూడా భగవంతుడు నిష్కల్మష చేతనం అని నిరూపించటానికి వీల్లేదు. సృష్టివాదం అడ్డు తగులుతుంది. యీ ప్రపంచం స్థిరమైనా, అస్థిరమైనా. లేక 'మాయ' అని వాదించినా, యిది భగవంతునిలో మేళవించి వున్నదని అంగీకరించవలసి వస్తుంది. అంటే యీ సృష్టి భగవంతుని బట్టి (కారణ కార్య) నడుస్తూవుంటుందని తేలుతుంది. కనుకభగవంతుడుకూడా వొకనియమబద్ధమైన క్రమానికి కట్టుబడవలసి వస్తుంది. అప్పుడుభగవంతుడుసర్వస్వతంత్రుడుకాజాలడు. నియమబద్ధమైనవస్తువు చేతనం(భగవంతుడు)కాజాలడు.

తరువాత మరొక చిక్కుకూడా వుంది. అస్థిత్వం అన

గానే ఆక్రమణ (కొంత చోటు ఆక్రమించుకొనుట) వస్తుంది. దానికి కట్టుబడినది చేతనం కాజాలదు. భగవంతుడు కారణ కార్యభావాలకు, కాల పరిమితులకు అతీతం. కాని మతం భగవంతుని వొకనియమానికి కట్టుపడునట్లు చేసి యీ ప్రపంచ సృష్టికర్తగా చూపించి అతని స్వతంత్రాన్ని, అతీత లక్షణాలను కుంటుపరుస్తుంది.

మతం భగవత్స్వరూపాన్ని కుంటుపరచటమే కాకుండా ఆధ్యాత్మిక సంపత్తు విలువ కూడా తగ్గిస్తుంది. చేతనం నుంచి జడం, నిష్కల్మషం నుంచి కల్మషం, ప్రకాశం నుంచి అంధకారం యెలా వస్తుంది ? ప్రకృతిని భగవంతుడని ఒక గారడీ చేయబడింది. జడ పదార్థానికి చేతనం, అంధకారానికి ప్రకాశం, భగవంతుడు కానిదానికి భగవంతుడు కారణంగా చూపబడింది. చేతనం తన చేతసత్వాన్ని త్యజించకుండా జడం కాజాలదు. అదేవిధంగా ప్రకాశం, భగవంతుడు కూడాను. కాబట్టి యీ గారడీలో జడ పదార్థం, అంధకారం, భగవంతుడు కానిది స్థిరాలని తేలుతుంది అద్వైతం సృష్టించబడ్డా ద్వైతం పరిష్కరించ బడలేదు. మతం, మతంగా నిలువలేదు.

భగవంతుని శూన్యం అని చెప్పటం నాస్తికవాదం. చేతనం, జడపదార్థంగా చూపటం దాని అస్వతంత్రతను అంగీకరించటం. ఇది మతానికి ఆధ్యాత్మిక వాదానికి వ్యతిరేకం. కాని యిదే సిద్ధాంతంతో భౌతికవాదం ఖండించబడుతుంది. కాని యిది పరిణామంలో వొకదశ. ప్రతిభావంలోనూ అంతర్భూతంగా అది నాశనం అయి అంతకంటె వున్నతమైన భావం బయలుదేరటానికి కారణం యిమిడివుంటుంది. మూఢ విశ్వా

సంతో బయలుదేరిన మతం హేతువాద సిద్ధాంతం మీద నడవటానికి ప్రయత్నిస్తుంది. కాని మతం, మతంగా వున్నంత కాలం యిది జరగదు. భగవంతునికి లేని ఆకారాన్ని, గుణాల్ని ఆపాదిస్తుంది. కాని యివే చివరకు భగవంతుడు లేడనే వాదానికి దారి తీస్తవి. మతం సృష్టించిన యీ సిద్ధాంతం మతాన్నే నాశనం చేస్తుంది. యీ సిద్ధాంతంవల్ల మతం నాశనం కావటమే కాకుండా దాంతోపాటు యీ సిద్ధాంతం కూడా నశిస్తుంది. యిది తర్కబద్ధంగా నడిపితే శూన్యవాదానికి దారి తీస్తుంది. యీ విధంగా భావం పరిణామం చెందుతుంది. యీ పరిణామావస్థకు అంతు లేదు.

క్రైస్తవ ఆధ్యాత్మికవాదం యీ విధంగా పరిణామావస్థ చెంది చివరకు స్పినోజా, హెగిల్ సిద్ధాంతాల్లో కలిసి పోయింది. ఆ సిద్ధాంతాలే తరువాత ఆధునిక భౌతిక వాదానికి దారితీసినై. అదేవిధంగా హిందూ ఆధ్యాత్మికవాదంకూడా అభివృద్ధిచెంది భౌతికవాదానికి, తత్వశాస్త్రానికీ దారితీయవలసింది. కాని యిక్కడకొన్ని పరిస్థితులవల్ల యీ ఆధ్యాత్మికవాదం ముందుకు సాగకుండా అక్కడే నిలిచిపోయింది. బౌద్ధ విప్లవం వోడిపోయి, సంఘం అరాచకస్థితిలో పడిపోవటంచేత యీ పరిణామావస్థ ఆగిపోవలసి వచ్చింది. యీ అరాచకమే సాంఘిక దుస్థితికి కారణమై తరువాత కూడా అభివృద్ధి జరగలేదు. కాని తక్కిన ప్రపంచంముందుకు వెళ్ళిపోయింది. కనుక మనం కూడా యీదుస్థితినుంచి హిందూ ఆధ్యాత్మికవాదాన్ని తప్పిస్తేనే తక్కినప్రపంచంలాగా ముందుకుసాగగలుగుతాము.

పాశ్చాత్య భావపరంపర కూడా క్రైస్తవమత

ప్రారంభం నుంచి వేయిసంవత్సరాల వరకు యిదేవిధంగా అజ్ఞానావస్థలో మునిగి చివరకు బయటపడగలిగింది. కాని హిందూదేశం కొన్ని వేల సంవత్సరాలనుంచి యీ అంధకారంలో మునిగి, యిప్పటికీ బయటపడలేకుండావుంది. తక్కిన మానవ ప్రపంచంతోపాటు ఇండియాకూడా ముందుకు సాగాలంటే యీ అంధకారంనుంచి బయటపడాలి. ప్రపంచంలో యేదేశంకూడా యీ అజ్ఞానాంధకారంలో మునక-లేస్తూవున్న హిందూ ఆధ్యాత్మికవాద సందేశంకోసం యెదురుచూడటం లేదు. తనను తాను రక్షించుకో లేనిదేశం యితరదేశాలను రక్షించటానికి కంకణం కట్టుకున్నానని చెప్పటం హాస్యాస్పదం. పాశ్చాత్యదేశాలు వొకప్పుడు దీన్ని అనుభవించటం, తదుపరి దీన్ని విసర్జించి ముందుకు వెళ్ళటంకూడా జరిగింది. హిందూదేశం తన ప్రాచీనకాలంలో అభివృద్ధి చెందిన తత్వశాస్త్ర సందేశాన్ని వొకసారి వెనక్కు తిరిగి అందుకో వలసివుంటుంది. అది ఆధ్యాత్మిక వాదాన్ని త్రోసివేసి భౌతికవాదాన్ని చూపింది. మననాయకులు యీవిషయాన్ని మరిచిపోయి తిరిగి ఆధ్యాత్మిక సంపత్తును పైకి లేవదీస్తున్నారు. ఆధ్యాత్మిక వాదాన్ని త్రోసివేసి భౌతికవాదాన్ని నెలకొల్పిన మన ప్రాచీన తత్వశాస్త్రం మనకు ఆదర్శంకావాలి. దాన్ని మనం అర్థంచేసుకోగలిగితే అదే మనల్ని యీ సాంఘిక దుస్థితి, విషమపరిస్థితులనుంచి తప్పించి ముందుకు తీసుకొని వెళ్ళ గలుతుంది. కాబట్టి మనం నాయకులం అనిపించుకునే ముందు, మన ప్రాచీనచరిత్రను విమర్శనా దృష్టితో బాగా చదివి జీర్ణించుకోవాలి.

---

# అహింసా వాదం

మన రాజకీయ పోరాటంలో అహింసావాదాన్ని చొప్పించటం మహాత్మాగాంధి ప్రత్యేక విశిష్టత అనే కాకుండా యిదే తక్కిన ప్రపంచాని కంతటికీ మార్గదర్శకం అనికూడా భావించబడుతుంది. కాని స్వతంత్రబుద్ధిగల విజ్ఞానులు కేవలం యీ పేరునుబట్టిగాని, లేక మహాత్ముడు ప్రచారంచేస్తున్నాడనో, లేక మన ఆధ్యాత్మికవాదం దీని వెనుక వుందనో దీనికి తగిన సహకారం యివ్వజాలరు. మహాత్ముడు నిజంగా మహాత్ముడు కావచ్చు. కాని అంతమాత్రంచేత యీసిద్ధాంతంలోని గొప్పదనాన్ని మూఢంగా విశ్వసించటానికి వీల్లేదు. అన్ని సిద్ధాంతాలను తర్కబుద్ధితో ఆలోచించాలి. వాటి ఫలితాలను బట్టి వాటి మంచి, చెడ్డలను విచారించాలి. ఆమంచిచెడ్డలుకూడా మానవసమాజఅభివృద్ధిని, ఆవశ్యకతను దృష్టిలో పెట్టుకొని నిర్ణయించాలి. మానవుడు సంఘంలో ప్రధానాంగం కాబట్టి సంఘాన్ని నాశనంచేసే సిద్ధాంతం - అది యెన్ని విశిష్టగుణాలను కలిగివున్నా మానవాభివృద్ధికి మానసికంగా, భౌతికంగా తోడ్పడజాలదు.

కేవలం పశుప్రాయులు (ఉదాహరణకు ఫాసిస్టులు) తప్ప యెవరూ హింసకావాలని కోరరు. ఇది అనాదిలో మానవుడు పశుప్రాయుడుగావున్నప్పటి సిద్ధాంతం. కాని యిప్పటికీ యీ తత్వంనుంచి సమాజం బయటపడలేదు. అట్టి పరిస్థితిలో కేవలం హింసనులేకుండా చేయటం — అహింసావాదాన్ని ప్రచారం చేయటం వొకటికాదు. యీ అంహింసా

వాదం ఒకప్రక్క అహింసాతత్వాన్ని బోధిస్తూ, మరొకప్రక్క హింసావాదాన్ని సమర్థిస్తుంది.

అహింసా సిద్ధాంతం కాంగ్రెసు స్వరాజ్య సాధనకు ఇతరమైన యేపద్ధతి అవలంబించకుండా బంధించి వేసింది పైగా యిది చేరటానికి వీల్లేని ఆదర్శం అయిపోయింది. ఒక గమ్యస్థానం చేరటానికి ఒకే ఒకసాధన చూపిస్తే ఆగమ్యస్థానం చేరవచ్చును. చేరకపోవచ్చును. అహింసాసిద్ధాంతానికి కట్టుబడిన కాంగ్రెసు ఒకవేళ హింసామార్గంలో స్వరాజ్యం లభిస్తే దాన్ని తిరస్కరించటానికూడా సిద్ధపడే స్థితిలోకి వచ్చింది. దాన్నిబట్టి కాంగ్రెసుకుగానీ, కాంగ్రెసు నాయకులకుగాని స్వరాజ్యం కంటె అహింసా సిద్ధాంతమే ప్రధాన ఆదర్శమయింది. కనుక స్వరాజ్యం సంపాదించాలనే బాధ్యతకు వారు కట్టుబడివుండ నక్కర్లేదు. కేవలం రాజకీయ పోరాటం అనుకున్నప్పుడు యీ సిద్ధాంతానిగ్గాని, యిలాంటి మతసంబంధమైన యితర సిద్ధాంతాలకుగాని ప్రత్యేకించి స్థానం యీయనక్కర్లేదు. కాని రాజకీయాల్లో వీటికి ప్రముఖస్థానం యిచ్చి రాజకీయాలు త్యజించటానికూడ సిద్ధపడినప్పుడు యీ అహింసా సిద్ధాంతం సామ్రాజ్యవాద హింసాతత్వాన్ని అంగీకరించ వలసివస్తుంది.

సామ్రాజ్యతత్వం హింసా పూరితమని ప్రత్యేకించి చెప్పనక్కర్లేదు. ఇతరదేశాలను జయించి వశం చేసుకొనటం హింస. యీ పరాయి ప్రభుత్వాన్ని కేవలం అహింసావాదంతోనే జయించాలనుకొని అలా సాధ్యపడనప్పుడు ఆ ఆదర్శాన్ని విడిచిపెట్టటం సామ్రాజవాద హింసాతత్వాన్ని అంగీక

రించటం అవుతుంది. స్వరాజ్యంజన్మహక్కు. యీ హక్కును పొందటానికి అహింసా సిద్ధాంతం సాధనకాకపోతే యీ హక్కును త్యజించ వలసివస్తుంది. అంతకంటె నీచం మరోటి లేదు. నీకు హక్కువుందని, అది సర్వోత్కృష్టమైన హక్కుఅని గ్రహించినప్పుడు, దాన్ని పొందటానికి అవసరమైన సాధనలన్నీ వుపయోగించటానికి నీకు హక్కువుంది. అది న్యాయసమ్మతం. కాని అహింసా సిద్ధాంతం కాంగ్రెసుకి యీ అవకాశం యివ్వకుండా ఒక పంజరంలో చిలుకలాగా బంధించివేసింది.

సాంఘికంగా యీ సిద్ధాంతం మేలుకంటే కీడే కలిగిస్తుంది. దీనికి వొకవుదాహరణ చెప్పితేచాలు. **1934** లో **ఒక** అమెరికా పత్రిక తరఫున అడిగిన ప్రశ్నలకు సమాధానం ఇస్తూ గాంధీ యీ విధంగా చెప్పాడు. "స్వదేశసంస్థానాధీశ్వరులను తొలగించటానికి యేదైనా హింసాకార్యం జరిగితే వారిని (రాజులను) రక్షించటానికి నేను అన్నివిధాల (?) పూనుకుంటాను" ఇందులో అన్నివిధాల అంటే హింసకూడా కలిసి వుందనే అనుకోవాలి. తరతరాలనుంచి పారతంత్ర్యంలో, బానిసత్వంలోపడి దారిద్ర్యంతో కుంగి, కృశించి పోతూవున్న ప్రజానీకం తమహక్కును పొందటానికి తిరుగుబాటుచేస్తే అది హింస అవుతుంది, కనుక వారితిరుగుబాటును అంగీకరించటానికి వీల్లేదు. కాని వారిని బానిసత్వంలో అట్టిపెట్టి పీల్చిపిప్పిచేస్తున్న రాజులను రక్షించటానికి హింస వుపయోగించవచ్చు.

సాధారణ మానవునికి యిది విడ్డూరంగా, అతిశయో

_క్తిగా కనబడవచ్చు. కాని గాంధీఅభిప్రాయం ఆచరణలో ఇంత కంటె వేరుగా పరిణమించదు. గాంధీ యేమిచెప్పినా దాన్ని తాను మనస్ఫూర్తిగా విశ్వసించినప్పుడే ప్రకటిస్తాడు. కనుక యీ ప్రకటనలో గాంధీని సందేహించ నక్కర్లేదు. కాబట్టి యీ ప్రకటనలో వున్న అంతరార్థాన్ని తర్కబద్ధంగా చూపి నప్పుడు దాన్ని ఒతిశయోక్తిగా భావించకూడదు.

దీన్ని మరొకదృష్టితో అర్థంచేసుకున్నా యిదే అర్థం రాక మానదు. గాంధి సంస్థానాధీశ్వరులకు వ్యతిరేకంగా యేమాత్రం హింసజరిగినా అంగీకరించడు. అందులో ప్రజల బాగోగులు గాంధికి పట్టలేదు. అతనికి కావలసింది అహింసా సిద్ధాంతం. రాజులహక్కులను రక్షించటం అతని ఆదర్శం కాదు. అతని ఆదర్శం, అహింసావాదం. దాన్ని రక్షించ టానికి అతడు హింసనైనా వుపయోగించటానికి వెనుకాడడు. అతడు వొకన్యాయాన్ని వెనుకవేసుకొని యీ కార్యం చేయక పోవచ్చు. కాని అతని అభిప్రాయం అహింసా వాదంలోని లోపాన్ని బయట పెట్టుతుంది.

యీ సంస్థానాధీశ్వరులను వెనుక వేసుకొని వచ్చే వారుకూడా యీ రాజులు అక్కడి ప్రజలను చక్కగా పరి పాలిస్తున్నారని రుజువు చేయలేరు. అక్కడి ప్రజల అభి మతంతోనే వీరు రాజ్యం చేస్తున్నారని ఎవరూ వాదించలేరు. వీరి పరిపాలన వారికిష్టం లేకుండా – అంటే హింసమీద జరుగు తుంది. యిక్కడ అహింసావాదం ఆచరణలో పెట్టాలంటే వీరి పరిపాలన- (హింస) అంగీకరించటమే అవుతుంది. వీరు బల వంతంగా అధికారాన్ని చేబూని రాజ్యం చేస్తున్నా, వీరిని

తొలగించటానికి అహింసా సిద్ధాంతం వొప్పుకోదు. వీరిని తొల గించటానికి ప్రయత్నిస్తే వీరు తమ్ము తాము రక్షించుకోటానికి యే సాధనాలైనా వుపయోగించటానికి వెనుకాడరు. కాని ప్రజలు తమను రక్షించుకోటానికి కేవలం అహింసావాదం తప్ప మరొకటి సాధనగా వుపయోగించటానికి వీల్లేదు. అంటే వారు తమ బానిసత్వాన్ని వొప్పుకోవలసి వస్తుంది.

కాబట్టి యిక్కడ పోరాటం అహింసకు హింసకు మధ్యకాదు. హింసకు, హింసకు మధ్య—వేల సంవత్సరాల నుంచి ప్రజానీకాన్ని పీల్చి పిప్పి చేస్తూన్న హింసకు, మానవ హక్కుకోసం, స్వాతంత్ర్యం కోసం, బానిసబంధనాలు తెంప టంకోసం, ఆ హింసను నాశనం చేసే కోసం వినియోగించే హింసకు మధ్య పోరాటం జరుగుతుంది. కాని యిక్కడ అహింసావాదం మొదటి హింసను హింసగా చూపించటం లేదు. రెండో హింసను హింసగా చూపించి అణగద్రొక్కు తుంది. దాని ఫలితం, రాజులు రాజ్యం చేస్తూనే వుంటారు. ప్రజలు బానిసలుగానే వుంటారు.

అహింసావాదులు దీన్ని అంగీకరించరు. అధికారంతో కూడుకొనిన ప్రతి వ్యవస్థ హింసతోనే నిలబడివుంటుంది. కాని దాన్ని తిరిగి హింసతో యెదుర్కొనకూడదని వారు వాదిస్తారు. యిది వాస్తవిక ప్రపంచంలో పరాజయాన్ని వొప్పుకొనటం అవుతుంది. ఆచరణలో యింతకంటె హీనంగా పరిణమిస్తుంది. మానవసమాజం దాస్యంలో వుండటానికి యిది పరోక్షంగా సహాయ పడుతుంది.

రాజకీయ, సాంఘిక స్వాతంత్ర్య పోరాట సమయంలో

యేమీ విషమ పరిస్థితు లుదయించకుండా యీ అహింసా వాదులు హామీ యిస్తే హింసావాదాన్ని పూర్తిగా త్యజించ వచ్చు. కాని వీరు అలాంటి హామీ యివ్వరు. కారణం, యీ పోరాటంలో రెండు పార్టీలు పాల్గొంటున్నవి. యిందులో ఒక పార్టీ యెప్పుడూ అధికారంలో వుండి హింసను వుపయోగించటానికి సిద్ధంగా వుంటుంది. యీ అహింసావాదులు, అధికారంలోవుండి హింసను వుపయోగించే పార్టీని అది చేయకుండా అరికట్టలేరు. కనుక వారు విషమపరిస్థితులు జరగకుండా వుంటానికి హామీ యివ్వలేరు. యీ విషమపరిస్థితులు వచ్చినప్పుడు అహింసాసిద్ధాంతానికి కట్టుబడిన స్వాతంత్ర్యాన్ని మరిచిపోయి లొంగిపోవటానికి సిద్ధపడతారు. యీ సిద్ధాంతంలోని మహదాశయాన్ని చూచుకొని వారు ఆత్మ సంతృప్తి చెందుతూ, ప్రజల బానిసత్వాన్ని లెక్క చేయక పోవచ్చు. కాని యదార్థవాదికి యీ సిద్ధాంతంలో వున్నలోపం, దానివల్ల జరిగే పరాజయం గోచరించక మానవు. యీ అహింసా సిద్ధాంతులు తమ సిద్ధాంతాన్ని పైకెత్తి ప్రపంచంలో చాటటానికి పూనుకోవచ్చు; హృదయంలేని రాజుల హృదయాన్ని మార్చటానికి విశ్వప్రయత్నం చేయవచ్చు. కాని బానిసత్వంలో నలిగిపోతూవున్న ప్రజానీకానికి హింస పనికి రాదని హుకుం జారీచేస్తే, వారు స్వాతంత్ర్యంకోసం, తమ బ్రతుకు కోసం, పోరాటం జరుపుతున్నప్పుడు అధికారంలో వున్న వర్గం హింసను ఆధారంగా తీసుకొని, వారిని అణగ త్రొక్కుతుంటే వారు కూడా గత్యంతరం లేక తమ ఆత్మ రక్షణ, భావిసంతతి శ్రేయస్సుకు, హింసకు ప్రతిగా హింసను

వుపయోగించితే——యీ అహింసావాదుల హుకుం వారి చావును అంగీకరించటమే కాకుండా స్వాతంత్ర్యం కావాలని గొంతెత్తి అరుస్తున్న వీరి ఆదర్శాన్ని వీరే భగ్నం చేసుకోటం అవుతుంది. అలాంటి పరిస్థితుల్లో వీరు వీరి ఆధ్యాత్మిక సిద్ధాంతాలతో, మాటల్లో బానిసప్రపంచానికి సహాయ భూతంగా వున్నా ఆచరణలో వారికి వ్యతిరేకమై వారిని బానిసలు చేసినవారికి సహాయభూతమౌతున్నారు. కనుక యీ అహింసా సిద్ధాంతం హింసావాదాన్ని నాశనం చేయటానికి మారుగా అధికారవర్గానికి సహాయపడి హింసా వాదాన్ని నిలుపుతుంది.

గాంధీ ఆంతరంగిక కార్యదర్శి తరువాత 'యీ ప్రకటన గాంధీ ముఖంనుంచి వచ్చినది కాదు. పత్రికావిలేఖరుల కథనం' అని దీన్ని ఖండిస్తూ తానొక ప్రకటన చేసాడు. గాంధీ యీ విధంగా ప్రకటించినా, గాంధీసిద్ధాంతాలకు కట్టుబడిన కాంగ్రెసు, సంస్థానాల్లో తటస్థభావాన్ని వహించటం సత్యం. దీన్నిబట్టే యీ సిద్ధాంతం సంస్థానాధీశ్వరుల పరిపాలన-వారు అంపుకోసం యేలాంటి సాధనలుపయోగించినా - అంగీక రిస్తుందని తేలుతుంది. దీన్ని సమర్థించటానికి పూనుకున్న వ్వాడు దీనివ్యతిరేక శక్తిని నాశనం చేయటానికి యేవిధమైన సాధన కానీ వుపయోగించవలసి వుంటుంది. కనుక గాంధీ ప్రకటన చేయలేదని వొప్పుకున్నా, గాంధీసిద్ధాంతం ప్రకారం కాంగ్రెసునడిస్తే యింతకంటె వేరుగా (రాజులను రక్షించటం-ప్రజలను నాశనం చేయటం) జరగదు.

గాంధీ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సులో యీ విధంగా

చెప్పాడు— "కాంగ్రెసు దారిద్ర్యంతో కృంగిపోతున్న సాధారణ ప్రజానీకానికి — వారు బ్రిటిషుయిండియా వారైనా, స్వదేశసంస్థానాల వారైనా — అందరికీ ప్రాతినిధ్యం వహిస్తుంది. వీరిరక్షణే కాంగ్రెసు పరమాదర్శం. వీరికీ, పైవర్గానికి న్యాయసమ్మతమైన పోరాటం జరిగితే కాంగ్రెసు తన తక్కిన ఆదర్శాలన్నీ వీరి రక్షణకోసం వదలు కొంటుంది." ఇంతకంటె మహాదాదర్శం మరొకటి లేదు. యింతులో గాంధీ అభిప్రాయాన్ని సంకోచించటానికి వీల్లేదు. కాని సిద్ధాంతాలను కేవలం అభిప్రాయాలకంటె తర్కబద్ధంతో ఆలోచించాలి. గాంధీ అభిప్రాయం మంచిది కావచ్చు. కాని అతడు కొన్ని మతసిద్ధాంతాలకు కట్టుబడి వీటిప్రకారం రాజకీయ, సాంఘిక స్వాతంత్ర్యాన్ని సంపాదించటానికి సిద్ధపడినప్పుడు ఆ సిద్ధాంతం ఆతని అభిప్రాయాన్ని ఆచరణలో వ్యతిరేకిస్తుంది. పైప్రకటన ప్రకారం కాంగ్రెసు స్వదేశసంస్థానాల్లో తటస్థంగా వుండటానికి వీల్లేదు. కాని వుంటుంది. దీనికి — గాంధీ అభిప్రాయానికి సామరస్యం యెలా కుదురుతుంది ?

'న్యాయసమ్మతమైన పోరాటం జరిగితే' అని గాంధీ తన ప్రకటనలో ఒకపదం వాడాడు గాంధీ అభిప్రాయం ప్రకారం ఇలాంటి పోరాటానికి అవసరమే వుండదు. ఇలాంటి పోరాటం జరక్కుండా చేయటానికి ఒకటేమార్గం వుంది—పోయా — వాయిలేని ప్రజానీకాన్ని అదేవిధంగా వుండమనటం. యిది అధికారుల్ని తమఅధికారం చలాయించు కోటానికి అవకాశం యిస్తుంది.

వర్గపోరాటం లేకుండా చెయ్యాలంటే బానిస ప్రజ

లను బానిసత్వం అంగీకరించేటట్లు చెయ్యాలి. అహింసావాదం అందుకు వుపకరిస్తుంది. వర్గపోరాటం వుండకూడదను, వర్గసామరస్యం కావాలి అనే సిద్ధాంతాన్ని వొప్పుకుంటే యేపోరాటం 'న్యాయసమ్మతం' కావటానికే వీల్లేదు. ప్రతిదీ హింసాపూరితమే అవుతుంది. కనుక ఫలితం బానిస ప్రజలు బానిసలుగా వుండవలసివస్తుంది. అహింసా సిద్ధాంతం తర్కబద్ధంగా ఆచరణలో పెట్టితే జరిగే ఫలితం యిది. కాగా హింసావాదాన్ని ఖండిస్తున్న యీ అహింసావాదం, హింసను అరికట్టాలనే నెపంతో హింసావాదంగా మారక తప్పదు.

గాంధీ మరొక సమయంలో యీ సిద్ధాంతాన్ని గూర్చి తన 'హరిజన'లో యీ విధంగా అభిప్రాయాన్ని వెల్లడించాడు. "కార్మికులు తమ పనిలోనికి వెళ్లేటప్పుడు వెళ్ళకుండా వారిని అడ్డగించటం (పికెటింగు) హింస అవుతుంది. కనుక ఆ పద్ధతి త్యజించాలి. అట్టి పరిస్థితుల్లో మిల్లు యజమానులు పోలీసు సహాయ మపేక్షించుట న్యాయసమ్మతం. కాంగ్రెసు ప్రభుత్వం వారికి తప్పక సహాయపడాలి...... సాధారణ ప్రజానీకానికి పూర్తిగా మేలు చేయాలని కోరే కాంగ్రెసు పెట్టుబడిదారీ పద్ధతిని సమర్థించ జాలదు. కాని అహింసాసిద్ధాంతం కాంగ్రెసు ఆదర్శం అయినంత కాలం ఒకరి స్థానాన్ని మరొకరు ఆక్రమించుకోటం కాని, ఒకరి ఆస్థిని మరొకరు లాక్కొనటంగాని కాంగ్రెసు సహించదు..."

దీన్ని ప్రత్యేకించి విపులీకరించటం అనవసరం. కార్మికులు సమ్మెచేసి పికెటింగు ప్రారంభిస్తే, కాంగ్రెసు ప్రభుత్వం అహింసావాదాన్ని రక్షించటానికి వారి మీద హింసను

ప్రయోగించటానికి వెనుకాడదు. పికెటింగు నుంచి కార్మికులను చెదరగొట్టటానికి వచ్చిన పోలీసు దళం అవసరమైతే కాల్పులు జరపటానికూడా అధికారం చేపూని వస్తుంది. యీ అహింసావాదులు అంతవరకూ వెళ్ళటానికూడా యెందుకు సిద్ధపడుతున్నారు? పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా ప్రదర్శనాలు జరుగుతున్నవి. వారి ఆస్తిపాస్తులకు, వ్యక్తి గౌరవాలకు భంగం కలుగుతుంది. కాబట్టి వారిని రక్షించటం అవసరం. అందుకోసం పోలీసులకు కావలసిన అధికారాలన్నీ యిచ్చి పంపుతున్నారు. యీ విధంగా అహింసావాదులు తమ అహింసావాదాన్ని రక్షించటానికి హింసావాదులవుతున్నారు.



# కర్మ—నేరం

సహజంగా ప్రతివాడు జైలుజీవితాన్ని అస్వతంత్రంగా భావిస్తూనే వుంటాడు. కాని తత్వవేత్తకు ఆజీవితంలో అనేక విషయాలు గోచరిస్తూవుంటవి. ఉదాహరణకు—నేనున్న జైల్లో వున్నవారిలో సాధారణంగా హెచ్చుమంది నేరస్థులు యెప్పుడూ జైల్లో వుండటానికే యిచ్ఛగిస్తూ వుండేవారున్నారు. వారి కథనం ప్రకారం, ఒక ముసలివాడు జైలు నుంచి చాలాకాలం తరువాత విముక్తిపొంది ఆత్మహత్యచేసుకున్నాడట. ఇందులో ఆశ్చర్య పడనక్కర్లేదు. చాలాకాలం జైలుజీవితం అనుభవించినవాడు బయట వాతావరణానికి పనికిరాడు. జైలే జీవితమైన వానికి బయట ప్రపంచంలో చోటులేదు. అతడు అస్పృశ్యుడుగా పరిగణించ బడతాడు. బయట ప్రపంచంలో బ్రతకటానికి జైలుకంటె కష్టతరంగా కనబడుతుంది. కాబట్టి హెచ్చుకాలం జైల్లోజీవితాన్ని అనుభవించిన వారు బయట ప్రపంచంలో బ్రతకలేనప్పుడు, కనీసం జైల్లోనైనా బ్రతకటానికి కావలసిన తిండి, గుడ్డ లభిస్తుందనే ఆశతో తమ జీవితమంతా అందులోనే గడపటానికి వుద్యుక్తులవుతారు. ఇంకా కొంతమంది నేరస్థులున్నారు. వారు బయట ప్రపంచాన్ని కోరుకుంటున్నా, ఒకవేళ జైల్లోవున్నా బాధపడరు. ఇంకా కొంతమంది తాము జైల్లో అస్వతంత్రులముగా వున్నామనే భావంకూడా లేని వారున్నారు. జీవిత కష్టాలు వారిలో ఆధ్యాత్మిక వాదాన్ని ప్రకోపించి ఈభౌతిక

ప్రపంచంతో తమకు సంబంధం లేనట్టుగానేవారు భావిస్తారు.

స్వాతంత్ర్యం పరిసరాలను ఆధారం చేసుకొని వుంటుంది జీవిత పరిస్థితులను బట్టి స్వాతంత్ర్యం వుంటుంది. కాబట్టి ఆపరిస్థితులను లోబరుచుకోటంలో స్వాతంత్ర్యం ఇమిడి వుంది. చుట్టూవున్న ప్రపంచాన్ని తనఅధీనం చేసుకొనటంలో నే మానవుడు తక్కిన జంతువులకంటె వేరుగా, మిన్నగా భావించ బడుతున్నాడు. కాని మానవుని యీశక్తి సాంఘిక పరిస్థితులు బాగా అనుకూలంగా వుంటేనే తప్ప పూర్తిగా ప్రజ్వలించ టానికి వీలులేదు. నిజంగా ఆలోచిస్తే సాంఘిక పరిస్థితులు వ్యతిరేకంగా, నికృష్టంగా వున్నప్పుడు మానవుడు తక్కిన జంతువులకంటె మిన్నఅయినా, జీవితాన్ని వాటికంటె నీచంగా అనుభవిస్తూ వుంటాడు. ఇది భారత దేశంలో 'కర్మ' అనే సిద్ధాంతం ద్వారా సమర్థించ బడుతుంది. యీ సిద్ధాంతం సంఘాన్ని బానిసత్వంలో అట్టి పెట్టటానికి వుపకరిస్తుంది.

ఆరు సంవత్సరాలకు పైగా నేను జైల్లో దాదాపు రెండువేలమంది నేరస్థులమధ్య నివసించాను. వారిలో యేకొద్ది మందో తప్ప తక్కిన వారంతా భారతదేశంలోని కన్నికులా లకు సంబంధించినవారు. తాము నివసించే విపరీత సాంఘిక పరిస్థితుల ఫలితంగా నేరాలు చేసారు. ఆ పరిస్థితులు వారు సృష్టించినవి కావు. నేరాలుచేయటానికి ఆలవాలమైన పరి స్థితుల్లో వారు కోరుకొని నివసించలేదు. కాని ఆ పరిస్థితుల ఫలితంగా తాము జైల్లో పడవలసి వచ్చిందని గుర్తించిన వారు అందులో చాలాకొద్దిమంది వుంటారు. హెచ్చుమంది తమ 'కర్మ' అని 'భగవదేచ్ఛ' అని తమలోతాము విచారిస్తూ

బాధపడుతూ వుండేవారు. కర్మసిద్ధాంతం ప్రకారం మాన వుడు తానేమీ చేయలేని హీనస్థితిలో పడిపోతాడు.

యీ సిద్ధాంతం ప్రకారం మానవుడు తాను చేసిన మంచి కార్యాలకు సౌఖ్యాన్ని అనుభవిస్తూ చెడుకార్యాలకు శిక్షింపబడుతూ వుంటాడు. ఇది యీలోకంలోనే జరగక పోవచ్చు. కర్మకు ప్రత్యామ్నాయంగా పునర్జన్మ సృష్టించ బడ్డది. కాని హిందూ ఆధ్యాత్మికసిద్ధాంతంప్రకారం మానవుని చరమలక్ష్యం 'నిష్కామకర్మ' - ఫలితంతో సంబంధం లేకుండా కార్యాచరణకు దిగటం. తనకిష్టంవున్నా, లేకపోయినా ఫలి తం తనకే చేకూరేటప్పుడు దానితో సంబంధం లేకుండా వుండటానికి యెలా సాధ్యపడుతుంది? ఇక్కడ దీన్ని అంగీ కరిస్తే మానవబుద్ధి అనవసరం అవుతుంది. ప్రతిదీ ఒకక్రమ బద్ధంగా జరిగిపోతూ వుంటుంది. అప్పుడు భగవంతుడుకూడా అనవసరం అవుతున్నాడు. ప్రతివ్యక్తియొక్క భవిష్యత్తు వర్త మానకాలంలో అతడు ఆచరించిన కర్మలనుబట్టి, ఇవి అతని గతించిన కాలాన్నిబట్టి జరిగిపోతూ వుంటుంది. కాబట్టి యీ రంకులరాటం నుంచి జీవిని విముక్తిచేసి, మోక్షం కలిగించ టానికి హిందూ ఆధ్యాత్మిక వాదానికి మరొక ఆదర్శం కావ లసి వచ్చింది. అది భగవద్గీతలో యీ విధంగా వర్ణించబడ్డది.

"ఫలితంకోసం నేను యేమీ చేయను. నేను ఒకరికి మిత్రుడను, మరొకరికి శత్రువునుకాను. నా సృష్టిలో యెవ రికి యేమికావాలో, యేది అవసరమో ముందుగానే యిచ్చి వేశాను. కాబట్టి ఫలితాన్ని కోరకుండా యెవరైతే నన్ను తెలుసుకొని నాలాగా వుండటానికి ప్రయత్నిస్తారో, వారు

అన్నింటినుంచీ విముక్తిచెంది స్వతంత్రులు కాగలుగుతారు."

యీ సూత్రాన్ని కర్మసిద్ధాంతంతో కలిపి చదివితే కర్మసిద్ధాంతం నిరుపయోగం అయితీరాలి. లేక మోక్షసాధన కోసం ఆచరణయోగ్యంకాని సిద్ధాంతం చూపబడిందని అంగీకరించాలి. కర్మసిద్ధాంతం నిజంగా అంగీకరిస్తే ఒకరు ఫలితం ఆసించకుండానే సత్కార్యాలు చేయవచ్చు. కాని వాటి ఫలితాలను వాడు తప్పనిసరిగా అనుభవిస్తున్నాడు. అతడు స్వర్గానికి వెళ్ళవచ్చు. కాని అక్కడకూడా అతడు స్వతంత్రుడు కాజాలడు. కర్మసిద్ధాంతంవల్ల అతడు యెప్పుడూ స్వతంత్రుడు కాటానికి వీల్లేదు కాగా యిది నిష్కామకర్మకు వ్యతిరేకంగా బయలు దేరుతుంది. కాని పరస్పర విరుద్ధమైన యీ రెండు సిద్ధాంతాలు ప్రజానీకాన్ని బానిసత్వంలో అట్టి పెట్టటానికి వుపకరిస్తున్నవి. కర్మ సిద్ధాంతం ప్రతివాడు తన పూర్వజన్మ సంచయాన్ని అనుభవించాలని బోధిస్తుంది. కాగా వచ్చే జన్మలో సుఖం అనుభవించటానికి యీ జన్మలో మంచి కార్యాలు చేయాలని ప్రబోధం చేస్తుంది. వాస్తవ ప్రపంచం కంటె అతనికివూహా ప్రపంచమే యదార్థంగా చూపబడుతుంది.

కాబట్టి జైలు జీవితం అనుభవించే నేరస్థులకు కేవలం వారి దోషంవల్ల జైల్లో పడలేదని, వారుచేసిన నేరం వారి బుద్ధి పూర్వకంగా కాక, సంఘంలోవున్న విపరీత పరిస్థితులవల్ల తప్పని సరి అయి వారు చేయవలసి వచ్చిందని, వారికి తెలియ చెప్పటానికి యెంత ప్రయత్నించినా ప్రయోజనం వుండదు. నేరంచేసిన వారు ఆనేరాలు చేయటానికి కారణాలేవో

సాంఘిక పరిస్థితినుంచి స్పష్టంగా చూపించవచ్చు. ఉదాహరణకు, సాధారణంగా దొంగతనాలు, బందిపోట్లుదారిద్ర్యం వల్ల జరుగుతూ వుంటవి. యెంతో నీతిగా ప్రవర్తించాలని చెప్పేవారు కూడా సాంఘిక కట్టుబాట్లతో బానిసలు కావలసి వస్తుంది.

జైల్లో వున్న నేరస్థులు బందిపోటు దొంగల ముఠా నాయకుడు సుల్తాన్‌ను గురించి అనేక చిత్ర, విచిత్రగాథలు చెప్పుకుంటూ వుండేవారు. అతడు వారిదృష్టిలో వీర పురుషుడుగా భావింపబడుతూ వుండేవాడు. అతనికీర్తి జైలు బయట గ్రామీణ ప్రజల్లోకూడా వ్యాపించినది. అతన్ని బంధించి, అతని ముఠాను నాశనం చేయుటానికి పోలీసులు యెంతో శ్రమచేయవలసి వచ్చింది.

సాధారణంగా దొంగతనం వృత్తిగా పెట్టుకున్నవారి మాదిరిగా సుల్తాన్ ముఠాలోని వారందరుగూడా పల్లెటూళ్ల లోని పేదరకానికి చెందినవారే. పల్లెటూరివారి సానుభూతి, సహాయంవల్లనే సుల్తాన్ ముఠా పోలీసులకు చాలకాలం దొరకకుండా వుండగలిగింది. హిందూదేశం బందిపోటు దొంగలు, అమెరికన్ బందిపోటు ముఠాలాగా ఐశ్వర్య కాంక్షతో దొంగతనానికి దిగటంలేదు. వారి బీదతనం వారి నావృత్తికి దించుతుంది.

నేను జైల్లో వున్నంతకాలం దొంగతనం నేరంక్రింద జైలుకు వచ్చేవారి సంఖ్య పెరుగుతూనే వుంది. అవి ఆర్థిక మాంద్యం (1931 - 36) యేర్పడిన రోజులు. ప్రపంచమంతా దీనివలన ధరలు పడిపోయినవి. రైతులు, యితరవృత్తులతో

జీవించే తక్కిన పల్లెటూరివాసులు పూర్తిగా దెబ్బతిన్నారు. రైతుకు అంతకుముందు బొటాబొటిగా నిత్యజీవితంకోసం సరిపొయ్యే ఆదాయం సగానికి సగం తగ్గిపోయింది. పారిశ్రామిక వస్తువులధరలు సుంకాలద్వారా, యితరపద్ధతులద్వారా తగ్గకుండా చేయబడ్డవి. కాబట్టి వారు అమ్మేవస్తువులకు, కొనే వస్తువులకు, ధరలలో హెచ్చుతేడా యేర్పడటంచేత రైతు మరీ విషమ పరిస్థితుల్లో పడవలసివచ్చింది. దీని ఫలితంగా రైతుమీద ఆధారపడిన యితర వృత్తిదారులు, చిల్లరవర్తకులుకూడా దెబ్బతిన్నారు.

ఇలాంటి పరిస్థితులే నేరాలు చేయటానికి కావలసినంత అవకాశాన్ని కలిగిస్తవి. పోలీసుకేసుల్లో హెచ్చుభాగం జమీందార్లు, వడ్డీవ్యాపారస్తులను కొల్లగొట్టినవే కనబడ్డవి. దారిద్ర్యం, దానికితోడుగా శిస్తుబాధ యేర్పడినప్పుడు సంఘంలో విషమపరిస్థితులు యేర్పడక మానవు. 'శాంతి, భద్రతలు' పేరిట ప్రభుత్వం హింసాప్రయోగం చేస్తున్నా సంఘ పరిణామాన్ని అరికట్టలేదు. కాని మనదేశంలోని జైళ్ళు మన సాంఘిక పరిస్థితులను ప్రతిబింబింప చేస్తున్నవి.

విషమపరిస్థితులేర్పడినా యీ సాంఘిక వ్యవస్థ యెలా నిలవగలుగుతుందనే ప్రశ్నవుదయించక మానదు. దీనికి సమాధానం, యీపరిస్థితులకు బానిసలైన వారిమనస్తత్వం నుంచే పొందవచ్చును. యీ సాంఘిక వ్యవస్థనిలవటానికి కారణం, రాజకీయంగా హింసాప్రయోగంకంటె ఆధ్యాత్మికంగా మానసికదాస్యమే యెక్కువ వుపకరిస్తుంది. నిరంకుశంగా ప్రవర్తించే రాజదండానికి మనసంస్కృతి, ఆచారవ్యవ

హారాలు అక్షింతలు జల్లుచున్నవి. కర్మసిద్ధాంతం రాజ్యాంగ అధికారానికి బలం చేకూరుస్తుంది. అంతా భగవంతుని యిచ్ఛ ప్రకారం జరిగిపోతుందనేవాదం, బూజుపట్టి నశించ టానికి సిద్ధపడిన సాంఘిక, ఆర్థిక వ్యవస్థలకు పట్టుకొమ్మగా పనిచేస్తుంది.

భారతదేశ చరిత్రలో నిరాశావాదం, మతవిశ్వాసం వ్యాపించి ప్రజానీకం నిస్సహాయస్థితిలోపడి వున్న సాంఘిక - రాజకీయ వ్యవస్థలకు దోసిలొగ్గటం యిది ప్రథమపర్యాయం కాదు. ప్రాచీనకాలంల్లో 'స్వర్ణయుగం' లో కూడా ప్రజలు తినటానికి తిండిలేక అన్నివిధాల బాధలు పడవలసివచ్చింది. మహాభారత గ్రంథంలో యిందుకు కావలసినంత సాక్ష్యం కనబడుతుంది.

వరాహమిహిరుడు ఇద్దరి వ్యక్తుల మధ్య ఒక సంభా షణ వర్ణిస్తాడు. అందులో వొకడు అప్పటి నిరంకుశత్వంమీాద తిరుగుబాటు చేయాలనే కాంక్షతో మాట్లాడుతాడు. "మన రాజు చేసే దుష్కార్యాలకు ఫలం మనం అనుభవిస్తూ బాధ పడుతున్నాం" దీనికి రెండవవాడు హిందూ ఆధ్యాత్మికవాదా నికి ప్రాతినిధ్యం వహిస్తూ సమాధానం చెప్పుతాడు. "అది యదార్థం కాదు. మనబాధలకు మనం పూర్వజన్మలో చేసు కున్న కర్మ కారణం." కర్మసిద్ధాంతం, పునర్జన్మ వాస్తవ స్వరూపం యిక్కడ బయటపడుతున్నవి. ఆధ్యాత్మిక సంబంధ మైన యీాసిద్ధాంతాలు ప్రాచీనకాలంలో ఋషులచేత ఘనంగా పొగడబడి, ప్రజలు తాము అనుభవించే బాధలకు తామే కారణం అనుకొని తృప్తిచెందేటట్లు చేయబడ్డవి. యీా

విధంగా యీ సిద్ధాంతాలు, వున్న సాంఘిక వ్యవస్థమీద తిరుగుబాటుజరగకుండా కాపాడుతున్నవి.

ఇప్పటికీ భారతప్రజానీకంలో హెచ్చుమంది కర్మసిద్ధాంతాన్ని అంటిపెట్టుకునే వున్నారు. మతంమీద నమ్మకం చూపుతూ పూజాపునస్కారాలు చేసేవారు, అంతా భగవంతునిమీద భారంవేసి జీవితం గడపుతున్నారు. మొదటి తరగతికి చెందినవారు తాము మూఢంగా నమ్మి అజ్ఞానాంధకారంలో పడివున్నారు. రెండవ తరగతికి చెందినవారిలో హెచ్చుమంది మోసకారులున్నారు. జైల్లో నా అనుభవాన్ని బట్టి యెవరైతే మతంమీద యెక్కువ విశ్వాసాన్ని కనబరుస్తూవుంటారో, వారు అంత మోసకారులుగా కనబడుతూ వుండేవారు. దేశంలోవున్న వివిధ వర్గాలజీవితం, జైలుజీవితం అనుభవించే ఆ యా వర్గాల దృక్పథాలనుబట్టి నిర్ణయించవచ్చు. కనుక నాఅభిప్రాయం అందరికీ వర్తింపచేయువచ్చును.

నేను ఒక పిల్లిపిల్లను పట్టుకొని పెంచి పెద్దదానిని చేసాను. జైల్లోవున్న రకరకాల నేరస్థులు దాన్ని రకరకాల చూస్తూ వుండేవారు. పెద్దనేరస్థులని పించుకునేవారు దానిని ఆప్యాయనంగా దగ్గరకుతీస్తూ వుండేవారు. దయా దాక్షిణ్యాలు చూపబడనివారు దాన్ని దయతోచూస్తూ వుండేవారు. సాధారణంగా నేరమేవృత్తిగా పెట్టుకున్న వారిహృదయాల్లో యెక్కడో గొప్పగుణాలు అణగారివుండటం నాఅనుభవంవల్ల గ్రహిస్తూ వుండేవాడిని. మానవుని సహజబుద్ధిని తెలుసుకోటానికి ఆ పిల్లిపిల్ల ఒకసాధనంగా వుపకరించినది. యెప్పుడూ పరమాత్మనుగురించి మాట్లాడుతూ మతసంబంధ

మైన ఆచార, వ్యవహారాలు తూ. చా తప్పకుండా ఆచరించే వారు ఆ పిల్లిని హేయంగా చూస్తూ దగ్గరకు రానిచ్చేవారు కారు. పిల్లి తన బ్రతుకు తెరువుకు యే యెలుకనో లేక పక్షినో పట్టుకొని తినటం దాని సహజ లక్షణం. ఆ పిల్లి ఆవిధంగా చేసినప్పుడల్లా వారు 'రామ, రామ' అని కళ్ళుమూసుకుంటూ వుండేవారు. కాని ఆకలిఅయి యేమీ దొరకక, తాము భుజిస్తూవున్న సమయంలో పిల్లి వారిదగ్గరకు వెళ్ళితే, దాన్ని కొట్టి దూరంగా తరుముతూ వుండేవారు.

నైతికశాస్త్రం ప్రకారం ఖూనీకంటె దొంగతనం పెద్ద నేరం. ఖూనీ అంటే ఒకవ్యక్తి లేక కొంతమంది వ్యక్తులు హింసకు గురికావటం. కాని దొంగతనం అలాంటిదికాదు. దీని వల్ల సంఘంయొక్క పునాదిఅయిన స్వాంతఆస్తికే భంగం కలుగుతుంది. కాని నేను దొంగతనంలో కూడా న్యాయం వుందని నమ్ముతున్నాను. ప్రత్యేకించి తాము బాధ్యులు కాక పోయినా, యే సంఘపరిస్థితులవల్ల తాము నేరస్థులుగా శిక్షింప బడుతున్నారో అట్టి సంఘాన్ని నాశనం చేయటానికి వారు తోడ్పడుతున్నారు.

దొంగతనమే వృత్తిగా పెట్టుకున్న నేరస్థుల్లో కొంత మంది నా స్నేహితులుగా వున్నారు. వారి మనఃప్రవృత్తులను పరీక్షిస్తుంటే చాలాఆశ్చర్యం కలుగుతూ వుండేది. వారిజీవిత విధానాన్ని చూచినా తమాషాగా కనబడుతూ వుండేది. వారు చాలా ఆనందంతో జీవితం గడుపుతూ వుండేవారు. నేరంచేసి జైల్లో పడినందుకు వారు యే విధంగా బాధపడు తున్నట్లు కనబడే వారు కాదు. పైగా వారు దానికి గర్విస్తూ

వుండేవారు. జేబులుకొట్టేవాడు ఆజేబుల్లోనుంచి తాను తీసు కున్న దానికంటె, ఆవ్యక్తులకు తెలియకుండా తానుచేస్తున్న దానికి తన తెలివితేటలను గూర్చి గర్వపడుతూ వుండేవాడు. అందులోనే అతడు ఆనందాన్ని అనుభవిస్తూ వుండేవాడు. కాగా ఆవ్యక్తులను వొట్టిదద్దమ్మలగా భావిస్తూ వుండేవాడు. అతడు నిజంగా దొంగతనం చేయటంలేదు. తనను పోలీసుల కప్పగించే సంఘాన్ని కూలద్రోయటానికి అతడు ప్రయ త్నిస్తున్నాడు.

జీవితంతో విరక్తిచెంది, యేమీ చేయలేని నిస్సహాయ స్థితిలోపడి మతంపేరిట పూజా పునస్కారాలతో కాలంగడిపే వారికీ, వీరికీ ఏమీ సంబంధంలేదు. వీరు విధికృతమని జీవి తాన్ని బలియివ్వరు. జైలంటే వీరికి భయంలేదు. అసలు భయం వుంటానికే కారణంలేదు. బయట ప్రపంచంలో వారికి యేమీ దొరకదు. జైల్లో కనీసం వారు బ్రతకటానికైనా యేదోకాస్త గంజి దొరుకుతుంది. బయట ప్రపంచంలో వారు స్వతంత్రులు. కాని వారి స్వాతంత్ర్యం వారికి తిండినివ్వదు, గుడ్డనివ్వదు, ఇల్లు వాకిలి లేకుండా వానలో, చలిలో చెట్ల క్రింద, పుట్లక్రింద, బజార్లో తిరిగేటట్లు చేస్తుంది. నాస్నేహితు డొకడు జైలునుంచి బయటపడటమే ఆలస్యం. తిరిగి వెంటనే మళ్ళీ జైల్లో పడుతూవుండేవాడు. అతన్ని మాటిమాటికి యెందుకు జైలుకు వస్తున్నావని ప్రశ్నిస్తే "స్వాతంత్ర్యంవల్ల నాపొట్టనిండటంలేదు, పోలీసులు నన్నువొదలి పెట్టటంలేదు" అనిసమాధానం చెప్పాడు. పోలీసులు తనను వదలిపెట్టనం దుకు అతనికి విచారంలేదు. రోజుకు రెండుపూటలా భోజనం,

వుంటానికి వాకగది, చలికాలంలో కప్పుకోటానికి ఒకదుప్పటి- ఇంతకంటె అతనికేమికావాలి. బయట ప్రపంచంలో అతడు స్వతంత్రుడుగావున్నా, అది అతని చావుకే దారితీస్తుంది. కాబట్టి అతనికి జైలుజీవితమే సుఖవంతంగావుంది.

యీవిధంగా భావించే నేరస్థులుచాలామందివున్నారు సాంఘిక పరిస్థితులవల్ల వారు ఆవిధంగా చేయబడ్డారు. వారికి దేవుడు, కర్మ మొదలైనవాటి సంగతి పట్టదు. అసలు వాటిని గూర్చి విచారించే అవకాశంకూడా వారికి లభించదు.



# దేవుడు - కర్మ

మనదేశంలో, దేవుడు - కర్మ చలామణి అయినట్లుగా మరేవి చలామణి కావటంలేదు. వీటిని రుజువు చేయటానికి వేదాలు, ధర్మశాస్త్రాలు, పురాణాలు, యింకా యెన్నో మతగ్రంధాలు సృష్టించబడ్డాయి. సాంఘిక ఆచార వ్యవహారాలు వీటికి అనుకూలంగా నిర్మించబడ్డవి. వేలసంవత్సరాల నుంచి మనసంఘం యీ వాతావరణంలో పుట్టి పెరగటంవల్ల దేవుడిమీద, కర్మసిద్ధాంతంలోనూ, మూఢవిశ్వాసం యేర్పడి పోయింది. యీ విశ్వాసంవల్ల ప్రజల్లో విచక్షణాజ్ఞానం లేక తక్కిన దేశాల ప్రజల అభివృద్ధిని అభివృద్ధికాదనే హేయ భావంతో చూడటం అలవాటై పోయింది సంఘం అభివృద్ధి

చెందాలంటే యీ తత్వం నశించాలి. తక్కిన సంఘాల అభి వృద్ధికి కారణం తెలిసికోవాలి మనలోవున్న లోటుపాట్లు దిద్దుకోవాలి.

మనదేశంలో యెంతోమంది సంఘసంస్కర్తలున్నారు. సంఘం చాలాహీనస్థితిలో వుందని, సంఘాన్ని బాగుచేయా లని వీరు ప్రచారం చేస్తారు కాని సంఘంలోవున్న హీనపరి స్థితులేమిటో, సంఘాన్ని యేవిధంగా బాగుచేయాలో వీరు చెప్పరు. పైగా వీరంతా సంఘంపేరిట, మతప్రచారం చేస్తూ ప్రజల్ని అజ్ఞానంలో వుంచటానికి ప్రయత్నిస్తారు రాజకీయ ప్రచారంకూడ యీ పొలిమేరలోనే వుంటంవల్ల ప్రజానీ కానికి అనుకున్నంతగా రాజకీయజ్ఞానం అలవడటం లేదు. పైగా మన హీనస్థితికి విదేశపరిపాలనే కారణం అని నొక్కి చెప్పటంవల్ల ప్రజానీకం అసలు సంఘంలోనేవున్న లోట్లు తెలిసికోలేకుండా వుంది.

సంఘం అభివృద్ధి చెందటంఅంటే సంఘంలోవున్న అన్ని వర్గాలు సుఖజీవనం చేయాలి. భౌతికంగా తిండి, గుడ్డ, వసతి, తీరికవుండి జీవితంలో దారిద్ర్యావస్థ లేకుండా ఉండాలి. సంఘమంతా ఈ పరిస్థితుల్లో వుండేటట్లు చేస్తూ, నిజమైన మానసిక విజ్ఞానం, సంస్కారం కలగటానికి అవకాశం కలి గించాలి. కాబట్టి సంఘం యీఅవస్థకు రావాలంటే మధ్యలో వున్న ఆటంకాలన్నీ తొలగించాలి. వున్న ఆటంకాలు తెలిసి కోకుండా ముందుకు పోవాలని ప్రయత్నించటం కలలుకంటం అవుతుంది.

దేవుడు - కర్మ అనేవి మనసంఘాభివృద్ధికి ఆటంక దాయకాలు. మనలో యెక్కువమంది దేవుడంటే యిదమిద్ధ మని తెలిసికొనేస్థితిలో లేకపోవచ్చు. నిత్యం ఉదయం, సాయం త్రం గుడికివెళ్ళి దేవుణ్ణి ప్రార్థించేవాళ్ళు అరుదుకావచ్చు. కర్మ సిద్ధాంతాన్ని తెలిసికొన్నవాళ్లు తక్కువకావచ్చు. కాని యింత మాత్రంచేత దేవుడు; కర్మ ప్రభావాలు మన సంఘంమీద పడలేదనుకోవటం పొరపాటు. మన నిత్యకృత్యాల్లో, మన సాంఘిక ఆచారాల్లో మనకు తెలియకుండా భగవన్నామ స్మరణ చేస్తూ వుంటాము. మనసాంఘిక పరిస్థితులన్నీ కర్మసిద్ధాం తంలో మునిగిపోవటంవల్ల మనకు తెలియకుండానే మనం కర్మసిద్ధాంతాన్ని ఆచరిస్తున్నాము. మన నిత్యకర్మలన్నీ వీటి మీద ఆధారపడి వుండటంచేత మూఢవిశ్వాసంలో పడి మనకు కొత్తగావున్న విషయాన్ని దగ్గరకు రానీయకుండా నిరసన భావంతో చూడటం మనకు అలవాటై పోయింది.

దేవుడువున్నాడనే భావం కలగ్గానే యీ ప్రపంచం అంతా మిధ్య అవుతుంది. యింతలో మానవజీవితం అణు మాత్రం అవుతుంది మనం జీవించటంలో నిరుపయోగం అని పిస్తుంది. జీవితంమీద ఆసక్తి తగ్గుతుంది. భౌతికపదార్థాలంటే నిరసనభావం కలుగుతుంది. తిండి, గుడ్డ, వసతి అనేవి అవస రాలుగా భావించము. మానవుడు 'పారమార్థికచింతన', 'శాశ్వత సుఖం' అనే మాటలకు మోసపోయి, సంఘాన్నుంచి దూరం అయి సంఘంలో తాను చేయవలసిన విధులు నెరవేర్చకుండా తనతోపాటు, తనకుటుంబాన్ని, చివరకు సంఘాన్ని నాశనం చేయటానికి పూనుకుంటాడు. దేవుడి పిచ్చిలో పడ్డవానికి

యిదంతా తెలియదు. అతనిదృష్టిలో యిది యెవరూ చేయలేని పనిగా వుంటుంది. కాని యదార్థంగా యిది యెవరూ చేయకూడని పని అని అతనికి తెలియదు."

కర్మసిద్ధాంతంకూడా యింతే, యీజాడ్యంతో మానవప్రయత్నం అనేది నశిస్తుంది. కోర్కెలనేవి వుండగూడదు. కోర్కెలే లేనప్పుడు మానవప్రయత్నం అనేదే వుండదు. కోర్కెలుంటే మోక్షంరాదని కర్మసిద్ధాంతం చెప్తుంది. తిండి కావాలి, బట్ట కావాలి, యిల్లు కావాలి అనేవికూడా కోర్కెలే: కాబట్టి ముక్తికావాలంటే మానవుడు యీకోర్కెలన్నీ చంపుకోవాలి. కాని యీ కోర్కెలు లేనప్పుడు మానవసంఘంలో సంఘీభావం వుండదు. అట్టి పరిస్థితుల్లో అడవుల్లో తిరిగే మృగాలకు, మానవులకు అట్టే తేడా వుండదు.

యీ దేవుడు-కర్మ సంఘాభివృద్ధికి యెలా ఆటంకాలో ఆలోచించటం యిక తేలిక. మనదేశంలో ముఖ్యంగా హిందూ సంఘంలో యీ తత్వం బాగా జీర్ణించివుంటంవల్ల సంఘంలో వున్న పరిస్థితులకు కొత్తఅర్థాలు చెప్పుకుంటున్నాము. మనలో యెక్కువమంది దరిద్రావస్థలో నున్నారు. కూడు, గుడ్డ లేక నానా అవస్థలు పడేవాళ్ళు యెంతోమంది వున్నారు. కాని యీ దరిద్రావస్థ యెందుకు వచ్చింది? దీన్ని యేవిధంగా తొలగించాలి అని ఆలోచించేవాళ్లు చాల అరుదు.

దేవుడు - కర్మ వున్నంతవరకూ అసలు యీ ఆలోచనే కలగదు. పారమార్థికచింతన, ముక్తి, దైవభక్తి మొదలైన వాటిముందు మన సంఘం అనుభవించే దరిద్రావస్థ అవస్థగా కనబడదు. కాగా భౌతిక అవసరాలతో (తిండి, గుడ్డ, వసతి

మొదలైనవి) మన సంఘానికి పనిలేక పోవటంవల్ల యీ దరిద్రావస్థని తొలగించే అవసరమే మన సంఘానికి లేక పోయింది. వొకవేళ అప్పుడప్పుడు దరిద్రావస్థ మితిమీరి ప్రజల్లో వేడిరక్తాన్ని పుట్టించినా, యీ అసంతృప్తిని చల్లార్చ టానికి దేవుడు - కర్మ అనేవి మనచుట్టూ కావలసిన వాతా వరణం తయారు చేస్తున్నవి. యింట్లోవున్న భార్య, పిల్లలూ తిండిలేక చస్తూవుంటే భర్త "యిది మనకర్మ, వెనుకజన్మంలో చేసిన పాపఫలితం, అంతా దేవునిమహిమ" అని బుజ్జగిస్తాడు. బయటికివెళ్ళి నలుగురిలో కలిసి కష్టసుఖాలు చెప్పుకోవాలను కుంటే 'నీ కర్మ' అనే సమాధానం వస్తుంది. బజారుల్లో, హరికథా పురాణకాలక్షేపాల్లో, నాటకాల్లో, సినిమాల్లో యెక్కడ చూచినా యీ దేవుడి లీలలు, అంతా దేవుడి మయంగా కనబడుతుంది. పడుకునేటప్పుడు, లేచేటప్పుడు, చివరకు దగ్గుతూ, తుమ్ముతూ కృష్ణా, రామా అని అనుకోవ టం అలవాటై పోయింది. సంఘం యీ పరిస్థితుల్లో వున్న ప్పుడు, ఆ సంఘం అంతా దేవుడిమయం అయినప్పుడు సంఘం లోవున్న లోటుపాట్లు కనబడవు. పైగా యే వొక్కరిద్దరో వ్యక్తులు తెలిసికొని యదార్థం చెప్పినా సంఘం వారిని ఖూనీ చేస్తుంది.

దేవుడు - కర్మవల్ల సంఘం యిలా అధోగతిలో వుంటే యిన్ని వేలసంవత్సరాలనుంచి యివి సంఘంలో యెలా నిలువ గలిగినవనే సందేహం కలుగుతుంది. యివి నిల్వటానికి కూడ కారణాలు లేకపోలేదు. వీటివల్ల అధికారంలోనున్న వర్గాలకు లాభం వుంది. దరిద్రావస్థలోనున్న వర్గాలు తమ దరిద్రావస్థ

తెలిసికోకుండా, తెలిసికున్నా యెదురు తిరక్కుండా చేయటానికి, తమ పెత్తనం సాగించుకోటానికి అధికారంలోవున్న వర్గాలకు యివి ఆయుధాలుగా వుపయోగ పడుతున్నవి. మొట్టమొదట (1) వేదకాలంలో మతప్రచారకులు, పీఠాధిపతులు, తరువాత (2) జమీందారీవర్గం, ప్రస్తుతం (3) పెట్టుబడిదారీవర్గం వీటిని ఆయుధాలుగా వుపయోగించుకుంటూ సంఘాన్ని తమ చేతుల్లో పెట్టుకున్నవి.

దీని ఫలితంగా ప్రజానీకం దరిద్రావస్థలోనున్నా దేవుడిమయం అనుకొని దారిద్ర్యావస్థని అనుభవిస్తూ వుంది.

కనుక యిండియా పరిస్థితులు బాగుపడాలన్నా, ఇండియాలో విప్లవం జరగాలన్నా, కేవలం విదేశపెత్తనం పోవాలనుకోటం, మనమేపెత్తనం చేయాలనుకోటంవల్ల ప్రయోజనం లేదు. సంఘంలో వేల సంవత్సరాలనుంచి చీడపురుగుల్లాగా వస్తూవున్న యీ దేవుడు - కర్మ అనేవి సంఘాన్నుంచి తొలగించాలి. అప్పుడే ప్రజల్లో ఆలోచనాశక్తి కలగటానికి, సంఘం బాగుపడటానికి అవకాశం కలుగుతుంది.



*Printed at Nalanda Press, Tenali G 98 C. 1000 D/21—1—47*
*For Praja Sahitya Parishat, Tenali. G. 79*

# మా యితర ప్రచురణాలు

## ఒక్కొక్క ప్రతి రూపాయి

### కథలు

ప్రపంచకథలు కె. రాధాకృష్ణమూర్తి
మల్లెపూలు ,,
చైత్రరథం జి. వి. కృష్ణరావు
జై హింద్ పి. వి. సుబ్బారావు
సరే, కానివ్వండి గోపీచంద్
గీతాపారాయణం ,,
దేవుని జీవితం ,,
సావిత్రమ్మగారి సంధ్యారాగం

### నాటికలు

ఖానీ కవిరాజు
ఆదర్శశిఖరాలు జి. వి. కృష్ణరావు
సునీథ ,,
ప్రపంచ నాటికలు
కె. రాధాకృష్ణమూర్తి

### నవలలు

జఘనసుందరి జి. వి. కృష్ణరావు
పరివర్తనం గోపీచంద్

### రాజకీయాలు

రాయ్ వ్యాసాలు కె. రాధాకృష్ణమూర్తి
,, 1వ భాగం ,,
,, 2వ భాగం ,,

జవహర్ లాల్ నెహ్రూ (ముప్పావలా)
కె. రాధాకృష్ణమూర్తి
ఇండియాలో విప్లవం ,,
ఇండియా భవిష్యత్తు ,,
రాయ్ జీవితం ,,
నూతన రాజ్యాంగచట్టం ,,
(ముప్పావలా)
ప్రజల ప్రణాళిక ఎ. వి. మోహన్
(ముప్పావలా)
మధ్యతరగతి ఎ. గోపాలకృష్ణమూర్తి
(అర్ధరూపాయి)
రష్యా విప్లవం పి. వి. సుబ్బారావు
(రూపాయి పావలా)

### పద్యకావ్యాలు

నూతపురాణం ప్రథమాశ్వాసం
కవిరాజు (రూపాయిన్నర)
నూతాశ్రమ గీతాలు కవిరాజు
వరూథిని జి. వి. కృష్ణరావు
(అర్ధరూపాయి)

### సాహిత్య మీమాంస

కావ్యజగత్తు జి. వి. కృష్ణరావు